Photo by B. Bhansali



బహుమతి
పొందిన వ్యాఖ్య

విన్నారా మీరంత?

పంపినవారు:
డి. ఎ. మూర్తి - మద్రాసు

# చందమామ

## ఈ సంచికలో



ఇవిగాక :

ప్రధాని నెహ్రూ పర్యటన - రంగులబొమ్మ కథ - ఫోటో శీర్షికల పోటీ, చిత్రకథ, వార్తలు - విశేషాలు మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

---

"చందమామ"లో ప్రచురణార్థం కథలూ, గేయకథలూ, హాస్యమూ పంపేవారు "చందమామ" పాత సంచికలనుంచిగాని, ఇతర పత్రికల నుంచిగాని కాపీచెయ్యవద్దని మనవి. మీమీ ప్రాంతాలలో చెప్పుకునే జానపద గాథలనూ, హాస్యకథలనూ రాసి పంపండి.

చందా వివరములు :

చందమామ (ఏ భాషలోనైనా)

విడి సంచిక 0 - 6 - 0 సంవత్సర చందా రు. 4 - 8 - 0

## చందాదారులకు మనవి

★

పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీలోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడువచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.

మేనేజరు

# చందమామ

## దీపావళి (నవంబరు) ప్రత్యేక సంచిక

రెట్టింపు పేజీలతో ఆకర్షవంతంగా వెలువడనున్నది.



- ★ నవరసభరితములైన కథలు
- ★ నవనీతతుల్యములైన గేయాలు
- ★ రంగురంగుల చిత్రాలు
- ★ రమణీయమైన మల్టికలర్ అఫ్‌సెట్ ముఖచిత్రం
- ★ చమత్కారమైన హాస్యరచనలు
- ★ చక్కని వార్తలు, విశేషాలు, వైజ్ఞానిక విషయాలు

## వెల 12 అణాలు



చందాదారులకు మాత్రము మామూలు సంచిక వెలకే పంపబడును. చందాదారులు కాగోరువారు త్వరపడవలెను. ఆగస్టు 15 అనంతరము చందాదారులుగా చేరువారికి ఈ సౌకర్యము ఉండదు.

ఏజెంట్లు ఆగస్టు 15 లోగా తమతమ ఆర్డర్లను పంపవలసిందిగా కోరుతున్నాము.

సర్క్యులేషన్ మేనేజరు,
చందమామ పబ్లికేషన్స్
మద్రాసు - 26.




infa

అరవై సంవత్సరములపైనుంచి డాక్టర్లు పెర్టుసిన్ టెష్నర్‌ను సిఫార్సు చేయుచున్నారు. ఎందువలననగా అది దగ్గులకు, గొంతు నొప్పికి శ్వాసకోశ వ్యాధికి, ఉబ్బసమునకు, కోరింత దగ్గుకు ఉపశమనము నిచ్చును. క్షేమముగా స్వస్థతనిచ్చును. తీసుకొనుటకు యింపితమైనది. పెర్టుసిన్ కొనుడు!

అందరు కెమిస్టుల వద్దను లభించును

ఎటెఫా లి., షాన్ లీచ్‌టెన్‌స్టెయిన్, స్విస్ కస్టమ్ అండ్ ఎకనామిక్ టెర్రిటరీ వారితో చేసుకున్న ఒడంబడిక ప్రకారము, యిండియాలో ఇన్‌ఫా లి., పోస్టు ఆఫీసు బాక్సు నెం. 1041, బొంబాయి-1 వారిచే తయారయినది.

ILY-9-TEL

**

# చందమామా

సంచాలకుడు : 'చక్రపాణి'

---

**1947** ఆగస్టు 15న—సరిగా 8 ఏళ్ళక్రితం—మన దేశం స్వాతంత్ర్యం సంపాదించింది. అదే తరుణంలో—1947 జులైలో—"చందమామ", తెలుగు, తమిళ భాషలు మాత్రమే నేర్చిన చిన్నపాపగా అవతరించింది. ఒకవంక దేశం బలపడుతూంటే, మరొకవంక "చందమామ" కూడా పుష్టి సంపాదించుకుని, దేశభాషలనేకం నేర్చి యావద్భారతానికి అల్లారుముద్దుబిడ్డగా రూపొందింది. దేశమూ, జాతీ అభివృద్ధి పొందినంతకాలం "చందమామ" అభివృద్ధి పొందుతూనే ఉంటుంది. అయితే అన్నిరకాల అభివృద్ధికీ దోహదంగా శాంతి ఉండాలి. ప్రపంచశాంతిని పెంపొందించటానికి భారత దేశమూ, భారత నాయకుడు, ప్రధాని జవహర్లాల్ నెహ్రూ చేసే కృషిని చూసి మనమంతా గర్వించాలి!

ఆగస్టు
1955



సంపుటి 17
సంచిక 2

# తిన్న ఇంటికే కన్నం!

ముత్తుకూరు అను గ్రామమందున
మునికృష్ణయ్యను రైతన్న
శక్తికొలది సేద్యంబు జేయుచు
భుక్తికి సంపాదించెగదన్న!

ఎండల కెండియు వానకు దడిసియు
కండల నన్నిట కరిగించి
దండిగ రాగులు రెండు గరిసెల
నిండుకు శ్రమతో పండించి—,

ధరపలికినచో అమ్మకొందమని
అరలో రాగుల పోయించి





రాత్రిపూటలో కావలి పడుకొని
రాగుల గాయుచు నుండెను రైతు.

ఒక్కనాడొక పరాయివాడు
ప్రక్కన నిలబడి దీనుండై
ఆకలియనుచు ప్రార్థించగనే
శోకము గని మునికృష్ణయ్య—,

ఇంటిలోపలకు తీసుకవెళ్ళి
వంటయైనదే వడ్డనజేసి
ఆకలి దీర్చి పంపె నంతియే
అ రాత్రియె కడు ఆశ్చర్యం!

నలుగురు దొంగలు తలుపులు బాదగ
కలవరపడి లేచెను రైతు





## గేయకథ

పగటిపూట తన యింట దిన్న యా
పాపి దొంగలకు నాయకుడు !

తిన్న ఇంటికే కన్నంవేసిన
ధీరుని ముఖమును తుడిచాడు
కనులు దెరువగా పైకి లేపి తను
కనికరంబుతో అన్నాడు.

"అన్నా రాతిరి భోంచేశావా ?
అన్నముందిలే లెమ్మ"నగా
ఖిన్నుడాయె గద దొంగ పాపము
కన్నుల నీరులు కారంగా !

వెలుపలివారలు దొంగలే యని
తెలుసుకొన్న మునికృష్ణయ్య—,

గబగబ అరను ఉసి రాగులను
గంపకు ముంచీ ఇల్లంతా
చల్లివేసి యొక బడితె పుచ్చుకొని
మెల్లగ తలుపును తీశాడు !

కాలూనగనే జర్రున జారగ
కంగారున నేలను బడగా
బడితె నెత్తుకొని మొత్తె దొంగలను
పడిరి తెలివి తప్పగ వారు !

దీపమెత్తుకొని ముఖముల జూచెను
తెలిసిపోయెగద విద్రోహం !



## అట్టి విూ ది బొ మ్మ

మార్కండేయమహర్షి పంచపాండవులవద్దకు వచ్చి అనేకమైన దివ్యకథలు చెబుతూవచ్చాడని తెలుసుకద! ఆ చెప్పిన కథలలో యిది ఒకటి :—

"పూర్వం, ఇక్ష్వాకువంశంలో ఉద్భవించిన పరీక్షితుడు అయోధ్యా నగరాన్ని ఏలుతూండేవాడు. ఆయన ఒకనాడు వేటకు పోయి, ఒక జింకను తరుముతూ అతివేగంగా పరుగెత్తసాగాడు. పరివారం వెనుకబడింది. జింక ఎక్కడికో పోయింది. రాజు ఎంత వెతికినా అది కనబడలేదు.

ఆ సమయంలో వీనులవిందు చేసే గానం ఆయన చెవులబడింది. అటు పోయిచూడగా, ఆ పాడుతున్నది ఒక చక్కని యువతి!

ఆమెను చూచి రాజు 'నీవెవరవు? ఇక్కడ ఒంటిగా ఎందుకున్నావు? నీభర్త ఎవరు?' అంటూ ప్రశ్నలు కురిపించాడు. అందుకామె 'నేనొక కన్యను. పేరు శోభన...' అని మాత్రం జవాబు చెప్పింది. 'అటయితే, నీవు నన్ను పెళ్ళాడతావా?' అని రాజు అడిగాడు. ఈ ప్రశ్నకు బదులుగా 'నీళ్ళున్నచోటికి నన్ను తీసుకువెళ్లనని మాట యిస్తే అలాగే వివాహం చేసుకుంటాను' అన్నది, శోభన. సరేనని పరీక్షితుడు ఆమెను గాంధర్వవిధిగా పెళ్లాడాడు.

పరీక్షితుడు కొంతకాలం శోభనతో సుఖంగా గడిపాడు. ఒకనాడు ఉద్యాన వనంలో విహరిస్తూ, జ్ఞాపకంలేక శోభనతో జలక్రీడకు దిగాడు. తక్షణమే శోభన మాయమైపోయింది. పరీక్షితుడు దిగాలుపడి సరోవరమంతా శోధించాడు.

అప్పుడు ఒక బ్రహ్మాండమైన కప్పమాత్రం కనిపించింది. తన భార్యను మింగినది ఆ కప్పే అని తలచి, పరీక్షితుడు రాజ్యంలో కనబడిన కప్పలన్నిటినీ చంపివేయమని శాసించాడు.

ఈ ఘోరవార్త తెలిసి కప్పరాజు మునివేషంతో పరీక్షితు ఆస్థానానికి వచ్చి, 'రాజా! ఆ శోభన నాకుమార్తె, ఆమె నిన్ను వరించిన సంగతి తెలియక యింటికి తీసుకుపోయాను. ఆమెను తిరుగా తెచ్చి నీకు వప్పగిస్తాను. నిష్కారణంగా కప్పలను చంపవద్దు' అని సమాధానపరిచి, శోభనను తెచ్చి వప్పగించాడు. పైగా—తన కూమార్తెను ఇలా శపించాడు :—'నీవు మహారాజునూ నన్నూ మాయచేసినట్టే నీపుత్రులు ఉత్తములను ద్రోహం చేసి, దాని దుష్ఫలితాన్ని అనుభవిస్తారు!'




# ఆశాపాతకుడు

కాశీరాజ్యాన్ని పాలించే బ్రహ్మదత్తుడికి ఇద్దరు కొడుకులు. తనకు అవసానకాలం సమీపించగానే, రాజు పెద్దవాడికి రాజ్యమిచ్చి, చిన్నవాడిని సేనాధిపతిగా చేశాడు. తండ్రి తదనంతరం జ్యేష్ఠుడి పట్టాభిషేకానికి ఏర్పాట్లు జరిగినై. తీరా, గద్దె యెక్కే సమయాన అతడు 'నాకీ రాజ్యంతో పని లేదు. తమ్ముణ్ణే ఏలుకోనీ' అంటూ వైరాగ్యంలో పడ్డాడు.

అతను కాశీరాజ్యం విడిచిపోయి, ఎక్కడో దూరాన వుండే ఒక సామంత రాజ్యం చేరుకున్నాడు. అక్కడ ఒక ధనికుని ఇంట కొలువుకు కుదురుకొని, కాయకష్టంతో కాలక్షేపం చేయసాగాడు.

కొంతకాలానికి కాశీరాజ్యం నుండి కొందరు ఉద్యోగులు భూములు తనిఖీచేసి పన్నులు విధించే పనిమీద ఈ రాజ్యానికి వచ్చారు. వారు ధనవంతుని యింట వున్న రాజకుమారుని ఆనవాలు పట్టి అతనికి భక్తి చూపారు. ఈ సంగతి తెలియగానే, ఆ ధనవంతుడు రాజకుమారునివద్దకు వచ్చి, 'కాశీరాజయిన మీ తమ్ముడికి జాబు వ్రాసి, నాకు పన్నులు తగ్గేట్టు చూడవలసింది' అని కోరాడు. రాజకుమారుడు అలానే వ్రాశాడు. కాశీరాజు వప్పుకున్నాడు.

ఇది వెల్లడికాగానే, గ్రామస్థులు అనేక మంది వచ్చి, తమకుకూడా భూమి పన్నులు తగ్గించమని రాజుగారికి వ్రాయమంటూ వేధించారు. అందరి తరఫునా రాజకుమారుడు విజ్ఞాపనలు రాసి కాశీరాజుకు పంపాడు. అందరికీ కోరినప్రకారం పన్నులు తగ్గినై.

నాటనుంచీ ప్రజలు వారీయవలిసిన పన్నులు పట్టుకవచ్చి రాజకుమారునికే చెల్లించి, పుచ్చుకోమని నిర్బంధింపజొచ్చారు. అతనికి లోకులు బ్రహ్మరథం



పట్టారు. రాజకుమారునికి వైరాగ్యభావం పోయి, మళ్ళీ రాజ్యకాంక్ష అంకురించింది. ఐతే, వద్దన్న రాజ్యం ఇప్పుడెలా వస్తుంది?

కనుక, క్రమంగా ఒక్కొక్క సామంత రాజ్యమే వశంచేసుకుంటూ, ఈ మాట తమ్ముడికి తెలుపుతూ వచ్చాడు. కాశీ రాజయిన అతని తమ్ముడు అన్న మాటలలో దేనికీ కాదనలేదు. తరవాత కాశీ రాజ్యమే ఆక్రమిద్దామని అన్నకు ఆశ పుట్టింది. నలుగురు పెద్దల్ని నియమించి, 'రాజ్యం వశపరుస్తావా, యుద్ధం చేస్తావా?' అంటూ తమ్ముడికి రాయబారం పంపించాడు. 'నాకు నీతో యుద్ధం వద్దు. అసలీ రాజ్యం నీదే. కనుక నీవే తీసుకోవడం న్యాయం' అని కబురు పంపాడు తమ్ముడు. అన్న రాజ్యం అధిష్ఠించాడు. తమ్ముడు సేనాధిపతి పదవి అలంకరించాడు.

పెద్దవాడు రాజ్యం ఆక్రమించాడేకాని, ఈ ఒక్క రాజ్యంతో అతనికి తృప్తి లేక పోయింది. రాజ్యతృష్ణ మిక్కుటమైనకొద్దీ ఇంకొకటి, మరొకటి, ఇలా ఎన్నో రాజ్యాలు జయించి, తన రాజ్యానికి చేర్చుకోసాగాడు. ఎన్ని రాజ్యాలు చేర్చుకున్నా అతనికి సంతుష్టి కలగలేదు.

దేవేంద్రుడు భూలోక వ్యవహారాలన్నీ చర్చచేస్తూ వుండగా, కాశీరాజ్యం సంగతి వచ్చింది. ఈ విషయంలో ఉపేక్షిస్తే లోకానికి హాని కలిగేట్టు తోచింది. అందుచేత పెద్దవానికి గట్టిగా బుద్ధి చెప్పాలనుకున్నాడు. ఈ సంకల్పంతో దేవేంద్రుడు ఒక యువకుని రూపంలో రాజదర్శనానికి వచ్చాడు. ఒక చిన్న రహస్యం చెప్పిపోదామని వచ్చానన్నాడు. రాజు వానిని తన అంతఃపురంలోకి తీసుకుపోయాడు.

'రాజా!—నా ఎరుకలో ఒక చోట మూడు మహానగరాలున్నవి. అవి సమస్త సిరి సంపదలతోనూ, గజ తురగ పదాతి బలాలతోనూ తులతూగుతున్నవి. వాటిని

నా శక్తివల్ల నేనే జయించి నీ కిస్తాను,' అంటూ ప్రోత్సహించాడు.

ఆశతో పరవశుడయ్యాడు రాజు. దేవేంద్రుడు అంతలో అదృశ్యమైపోయాడు.

రాజు యువకునికోసం వెతికాడు. కనిపించకపోయేసరికి కలవరపడ్డాడు. వెంటనే ముఖ్యోద్యోగుల్ని పిలిపించి, 'ఇప్పుడు వచ్చినతడు నాకు మూడు మహానగరాలను జయించి ఇస్తానన్నాడు. చూడండి. వెతికి పట్టండి,' అని వేగిర పెట్టాడు.

పరిచారకులు పోయి నగరమంతా గాలించారు. యువకుని జాడ లేదు. రాజుకు మతిపోయినట్టయింది.

ఈ విచారం ముదిరి, మనోవ్యాధిగా పరిణమించి, రాజు మంచం పట్టాడు. ఎంతటి ఘనవైద్యులు వచ్చినా వ్యాధి కుదరలేదు.

ఇదే సమయాన—సమస్తశాస్త్రాలలోనూ ప్రవీణుడై, బోధిసత్వుడు తక్షశిలనుండి ఇంటికి వచ్చాడు. రాజు సంగతి తెలిసి, కోటకు వెళ్ళి, 'వ్యాధి నేను కుదురుస్తా'నని కబురుచేశాడు.

లోపలికి రమ్మన్నాడు రాజు. 'మీ బాధ యేమిటి?' అని అడిగాడు బోధిసత్వుడు.

అప్పుడు ఆవేశంతో రాజు—తనకు ఆనాడు యువకుడు మూడు మహానగరాలు



వాగ్దానంచేయడం దగ్గిరనుంచీ జరిగిందంతా వివరంగా చెప్పాడు. 'అప్పటినుంచీ నా కీ జబ్బు పట్టుకొని పీడిస్తున్నది. కుదర్చగలవేమో చూడు' అన్నాడు.

'రాజా! ఈవిధంగా మనోవేదన పడుతూ వుంటే ఆ మహానగరాలను జయించటం సాధ్యమవుతుందా?' అని ప్రశ్నించాడు బోధిసత్వుడు. 'లేద'న్నాడు రాజు.

'అందుచేత విచారపడి ఏమీ లాభం లేదు. ఈ ప్రపంచంలో ప్రతివస్తువూ కొంత కాలానికల్లా కంటికి కనబడకుండా నశించిపోతున్నదికద!' అని అడిగాడు బోధిసత్వుడు. 'అవు'నన్నాడు రాజు.

'ప్రతి జీవుడూ—ప్రాణం పోవటంతో, దేహాన్ని సైతం ఇక్కడ వదిలి పోవలిసిందే కద!' అని మళ్ళీ అడిగాడు బోధిసత్వుడు.

ఒప్పుకొన్నాడు రాజు.

'కనుక, రాజా!—మూడు కాదు, ముప్పయి మహానగరాలు సంపాదించినప్పటికీ, నీవు ఎక్కువ సుఖపడేదిలేదు. ఏదీ శాశ్వతంకాదు. 'ఆశ' అనేది ఒక పెనుభూతం. దానికి అంతులేదు. ఆశకు మానవుడు లొంగినప్పుడు, ఇప్పుడు నీకు పట్టుకొన్నలాగే, మనోవ్యాధి పట్టుకు పీడిస్తుంది. దీని పీడ తప్పించుకోవాలంటే మనసులో కలిగే కోరికలను ఒక హద్దులో ఉంచాలి. దాటనీయరాదు. చెప్పుకి సరిగా సరిపడేట్టు మాదిగవాడు ఎలాగ చర్మం కోస్తాడో, అలా జీవితంలో మనకు ఉపయోగపడేటంత వరకే కోరికల్ని అతిశయించనీయాలి. హద్దు దాటనిచ్చామో, అజ్యం పోసిన అగ్నిజ్వాలలాగా కోరికలు విజృంభించి, ప్రమాదకరమవుతై,' అని చెప్పేసరికి, రాజుకు మనశ్శాంతి కలిగి, వ్యాధి నయమయింది.

రాజు కోరికపైన బోధిసత్వుడు మరెన్నో ధర్మబోధలు చేసి, జీవితాంతంవరకూ దేశికుడుగా ఉండి, రాజ్యపాలనలో అవసరమైన సలహాల నిస్తుండేవాడు.






## 2

[ శాంతి సంపదలతో తులతూగుతున్న మరాళద్వీపానికి మందరదేవుడు రాజు. పొరుగున వున్న కుండలినీద్వీపంలో అరాజకం బయలుదేరింది. నరవాహనమిశ్రుడనే సేనాని అధికారాన్ని హస్తగతం చేసుకుని, మరాళద్వీపంమీదికి దాడి బయలుదేరాడు. అదే సమయంలో అతడి వేగులు మందరదేవుణ్ణి బంధించి తీసుకుపోసాగారు. అప్పుడు—]

ఉరుములూ మెరుపులతో జడివాన ప్రారంభమైంది. సముద్రపుతీరాన గల నిడుపాటి కొబ్బరిచెట్లనూ, సరుగుడు చెట్లనూ కూకటి వేళ్ళతో పెళ్ళగిస్తూ తుఫానుగాలి వీచింది. సముద్రంలో ప్రాణాలకు తెగించి యుద్ధం చేస్తున్న మరాళ, కుండలినీద్వీప నావికాదళాలు చెల్లాచెదరు కాసాగినై. అప్పటికే తీరం చేరిన కొన్ని నావలనుంచి కుండలినీ సైనికులు దిగి, మరాళద్వీప సైనికులతో బాహాబాహి యుద్ధానికి తలపడ్డారు.

గుర్రాన్ని అదలించి అతివేగంగా స్వారి చేస్తున్న మందరదేవుని చెవులకు కుండలినీ, మరాళసేనల యుద్ధధ్వానాలు వినబడుతున్నవి. 'జై కుండలినీ!' అని అరుస్తూ భీకరంగా ముందుకు చొచ్చుకు వచ్చే కుండలినీ సైనికులను, 'జై మరాళీ!' అని చెవులు చిల్లులు పడేలా అరుస్తూ మరాళ సైనికులు ఎదుర్కొంటున్నారు. ఆకాశాన పెనుమబ్బులు, గాలి తాకుడుకు చెల్లాచెదరవుతూండగా, ఉరుముల కఠోర శబ్దం భూమ్యాకాశాలను బద్దలు చేస్తున్నది.





మందరదేవుడిని బందీచేసిన ద్రోహులను సమీపిస్తున్నారు. ఆ నినాదాలు వినగానే మందరదేవుడు వెనుదిరిగి చూశాడు. మరు క్షణంలోనే అతడి కళ్ళు మిరుమిట్లు కొలి పేంత కాంతితో, చెవులు బద్దలయేంత ధ్వనితో పెద్ద పిడుగు పడింది. అతడు త్రుటికాలంలో కళ్ళు తెరిచేసరికి ద్రోహులైన ఇద్దరు అంగరక్షకులూ నేలమీద పడి గిలగిల తన్నుకుంటున్నారు. వాళ్లు ఎక్కిన గుర్రాలలో ఒకటి మరణబాధతో తన్నుకుంటోంది. రెండవది పిచ్చి ఎత్తినదానిలా దారీతెన్నూ లేకుండా పరిగెత్తుతున్నది.

"నా రాజ్యానికీ నాకూ యింతటితో సరి!" అనుకున్నాడు మందరదేవుడు. తను తప్పించుకు పారిపోయే మార్గం లేదు. ఎదురు తిరిగి ద్రోహులైన తన అంగరక్షకులతో పోరాడేందుకైనా, తను నిరాయుధుడు. ఇలాంటి ఆపదనుంచి బయటపడటం ఎలానా అని అతడు ఆలోచించేటంతలో, "జై మరాళీ!" అన్న సింహనాదాలు అతడిని ఆశ్చర్యపరిచినై.

ఆ విధంగా నినాదాలు చేసినవారు మంత్రి పంపగా, మందరదేవుడి రక్షణకు బయలుదేరిన సైనికులు. వాళ్ళు అతి వేగంగా గుర్రాలను ముందుకురికిస్తూ,

మందరదేవుడు దఢాలున గుర్రం దిగాడు. అంతలో అతడి రక్షణకై బయలుదేరిన సైనికులు నలుగురూ అక్కడికి చేరారు. అందరూ మరణబాధతో విలపిస్తున్న అంగరక్షకులకేసి నడిచారు.

మరణిస్తున్న అంగరక్షకులలో ఒకడు, మందరదేవుడికేసి చేయి ఎత్తి దగ్గరకు రమ్మన్నట్టు సౌజ్ఞచేశాడు. మందరదేవుడు అతణ్ణి సమీపించి దగ్గరగా కూర్చున్నాడు. అప్పుడు ఆ సైనికుడు ఆయాసపడుతూ:

"మహారాజా! మేం ఇద్దరం మీకు ద్రోహం తలపెట్టాం. కాని ఆ నీచకార్యానికి మేం ఒడిగట్టింది ధనంకోసం కాదు. ఈ





కార్యంలో తనకు సహాయపడకపోతే, మా కుటుంబాలను సర్వనాశనం చేస్తానని, ఆ నీచుడు—నరవాహనమిశ్రుడు మాకు వర్తమానం పంపాడు. మేం కుండలినీ ద్వీపవాసులమని మీకు తెలియంది కాదు. మా ద్రోహానికి ప్రాయశ్చిత్తం అనుభవించాం. కాని మీకు చేసిన ద్రోహానికి పరిహారంగా ఒక సహాయం చేయదలిచాను. మీరు ఏ కారణంచేతనైనా యీ ద్వీపాన్ని వదలదలిస్తే—యిక్కడికి సూటిగా వున్న ఆ కొబ్బరితోటకు ఆవల, తీరానికి అనుకుని రెండు పడవలు వున్నవి" అంటూ ఆ అంగరక్షకుడు ప్రాణంవిడిచాడు.

మందరదేవుడు లేచి తన కోటకేసి పరికించిచూశాడు. కోట బురుజులపైనుండి సైనికులు అగడ్తలకేసి బాణాలు వదులుతున్నారు. కొందరు పెద్ద పెద్ద రాతి బండలను కిందకు దొర్లిస్తున్నారు. కుండలినీ సైనికులు నిచ్చెనలతో కోట గోడలు ఎక్కేందుకు ప్రయత్నిస్తున్నారు.

తన సైనికుల పరిస్థితి విషమంగా వున్నదని మందరదేవుడు గ్రహించాడు. ఇంత పెనుతుఫానులోనూ కుండలినీ సైనికులు తన రక్షణ సైనికులను ఓడించి కోటను ముట్టడించారు. తను యిప్పుడు శత్రు సైనికుల వెనకభాగాన వున్నాడు. నలుగురు





సైనికులతో తను వాళ్లను వెనకనుంచి ఎదుర్కోవటం ఆత్మహత్యతో సమానం.

ఇలాంటి ఆలోచనలతో మందరదేవుడు కొట్టుమిట్టాడుతుండగా, అగ్నిపర్వతం బద్దలైనంత భయంకర శబ్దం వినిపించింది. మరుక్షణంలోనే అతడి కాళ్లకింద భూమి దద్దరిల్లింది. నిర్విణ్ణుడై అతడు కోటకేసి చూశాడు. కోట బురుజు ఒకటి గాలిలోకి లేచి, ముక్కలు చెక్కలుగా కిందకు ఒరగటం కనిపించింది. సైనికుల హాహాకారాలూ, కేకలూ మిన్నుముట్టినై.

"సర్వనాశనమైంది! మందు దట్టించి కుండలినీ సైనికులు మన కోటగోడను



బద్దలుకొట్టారు. మన ఓటమి క్షణాల్లో ఉంది," అన్నాడు మందరదేవుడు. "అవును మహారాజా!" అంటూ పక్కన వున్న నలుగురు సైనికులూ తలలు వంచారు.

ఇక తను మరాళ ద్వీపాన్ని వదలక తప్పదన్న నిశ్చయానికి వచ్చాడు మందరదేవుడు. ఒకసారి శత్రువు కోటను భేదించిన తరువాత దానిని వశపరుచుకోవటం ఏమంత కష్టంకాదు. ఆ పని ముగియగానే శత్రువులు తనకోసం వెతుకుతారు. తను ఖైదీగా చిక్కితే, చిత్రహింసలకు గురిచేయకపోయినా, ఆ క్రూర నరవాహన మిశ్రుడి చేతులలో అవమానం తప్పదు.

"పదండి, ఈ ద్రోహి చెప్పిన పడవల మాట నిజమే అయివుంటుంది. మరాళ దేవి కరుణ వుంటే మనం సురక్షితంగా మరో ద్వీపం చేరగలం. ఆ దేవి సహాయంతోనే ఈ మరాళరాజ్యాన్ని తిరిగి జయించగలం కూడా!" అన్నాడు మందరదేవుడు.

సైనికులు విచార వదనాలతో కోట వైపుకు చూచారు. కోట బురుజులనుండి ప్రతిఘటిస్తున్న మరాళ సైనికుల జాడ లేదు. కుండలినీ సైనికులు నిచ్చెనల సహాయంతో కోట గోడలపైకి నిర్భయంగా ఎగబాకుతున్నారు.







మందరదేవుడు ముందుకుసాగాడు. తమ రాజు నిరాయుధుడుగా వున్నాడని గ్రహించిన ఒక సైనికుడు, మరణించిన అంగరక్షకులదగ్గర వున్న ఒక కత్తిని తీసి రాజుకు అందించాడు. అందరూ సముద్ర తీరాన గుబురుగా కనబడుతున్న కొబ్బరి తోటకేసి బయలుదేరారు. ఉరుములూ, మెరుపులతో ధారాపాతంగా వర్షం కురుస్తూనే వుంది.

నిరాశా నిరుత్సాహాలతో కుంగిపోతూ తలలు వంచుకుని నడుస్తున్న మందరదేవుడూ, సైనికులుకూడా—వెనుక భాగాన అల్లంత దూరంలో చెలరేగిన కోలాహలం విని గిరుక్కున వెనుదిరిగి చూచారు. కోట వైపునుంచి తమకేసి హుటాహుటిగా వస్తున్న కొందరు అశ్వికులు వాళ్ళకు కనిపించారు. వెంటనే మందరదేవుడు పెద్దగా కేకవేసి-

"అరుగో, వాళ్ళు కుండలినీ సైనికులు. మనను పట్టి బంధించేందుకు వస్తున్నారు. ఈ బయలు ప్రదేశంలో మనం అశ్వికులను ఎదిరించటం ప్రమాదకరం. ముందు ఆ కొబ్బరితోట చేరటం మంచిది!" అంటూ అటుకేసి పరిగెత్తసాగాడు. సైనికులుకూడా తమ రాజును అనుసరించి పరిగెత్తారు. అందరూ కొబ్బరితోట చేరి అక్కడచెట్ల వెనక నక్కి కోటదిక్కుకేసి చూచారు. కుండలినీ అశ్వసైనికులు కొందరు వాయు వేగంతో అటువైపు వస్తున్నారు. మందరదేవుడు కత్తిదూసి, అక్కడకు అతిదాపుల నున్న సముద్రంకేసి చూచాడు. ద్రోహి అంగరక్షకుడు చెప్పినట్టు అక్కడ రెండు పడవలు ఒడ్డున తేలిఆడుతున్నవి. ఒక్క ఉరుకున ఆ పడవలను చేరి సముద్ర మార్గాన్ని అనుసరించటం క్షేమమా అన్న ఆలోచన కలిగింది మందరదేవుడికి. కాని రెండవవైపుకు చూచేసరికి కుండలినీ అశ్వికులు—పదిహేనుమంది దృఢకాయులు తోటను సమీపిస్తున్నారు. వారి చేతులలో



తళతళ లాడుతున్న కత్తులు మెరుపుల్లా కాంతిని ప్రసరిస్తున్నై.

"విజయమో, వీర స్వర్గమో! మరి మార్గాంతరం లేదు," అంటూ మందర దేవుడు కత్తి ఝళిపించి, సైనికులను హెచ్చరించాడు. వారుకూడా కత్తులు దూసి చెట్లచాటున పొంచి నిలబడ్డారు. తమ శత్రువులు ఏ చెట్టుచాటున దాగివున్నదీ తెలియని కుండలినీ అశ్వికులు గుడ్డిగా తమ గుర్రాలతో చెట్ల మధ్యకు వచ్చేశారు. 'జై మరాళీ!' అంటూ మందరదేవుడు బెబ్బులిలా ముందుకు ఉరికి ఒక శత్రు సైనికుడి కంఠాన్ని కత్తితో నరికివేశాడు.



మందరదేవుడి సింహగర్జన, కుండలినీ అశ్వికుల గుండె నిబ్బరాన్ని చీకాకుపరి చింది. ఇరుకు చెట్లమధ్య చిక్కుకుపోయిన గుర్రాలను ఎటు తిప్పుకునేందుకూ సాధ్యం కాక వాళ్లు తబ్బిబ్బు పడసాగారు. ఇదే అదనుగా మందరదేవుడూ అతని సైనికులూ అశ్వికులలో ఒక్కొక్కరినే తమ వాడికత్తు లతో గాయపరచసాగారు.

అశ్వికులలో నలుగురైదుగురు కింద పడగానే, ఇది పనిగాదని మిగిలిన అశ్వి కులు కింద దిగి మందరదేవుడినీ, అతని సైకులనూ ఎదుర్కొన్నారు. చెట్లమధ్య బాహాబాహి యుద్ధం ప్రారంభమయింది. ఆ సంకులసమరంలో కత్తిదెబ్బలు కొన్ని శత్రువులకూ, కొన్ని గురి తప్పి చెట్ల బోదె లకూ తగలసాగినై.

పోరాటం ప్రారంభమై ఒకటి రెండు ఘడియలు జరిగేసరికి కుండలినీ సైనికు లలో చాలామంది మరణించారు. చెట్ల చాటున తప్పుకుంటూ దొంగమాటుగా ముందుకు దూకి, అంతలోనే చెట్టుచాటుకు తప్పుకుంటూ మందరదేవుడూ, అతడి సైని కులూ చాలామంది శత్రువులను తుద ముట్టించారు. అక్కడకు వచ్చిన పదిహేను మంది అశ్వికులలో అధిక భాగం మర

జించటమో, గాయపడి బొబ్బరించటమో ప్రారంభించేసరికి , మిగతావాళ్ళు గుండె ధైర్యం సన్నగిల్లి అక్కడినుంచి పారిపో సాగారు. అలా పారిపోయే శత్రువులను, 'జై మరాళీ !' అని అరుస్తూ మందరదేవుడి సైనికులు వెనుకనుంచి కత్తులతో ఎదుర్కొని మరికొందరిని హతమార్చారు.

కొద్దిసేపటిలో అంతా సద్దుమణిగింది. ఆకాశాన ఉరుముల రణగొణ ధ్వనితప్ప-కోట ప్రాంతంనుంచికూడా ఏ ధ్వనీ రావటం లేదు. చావు తప్పించుకున్న కుండలినీ సైనికులు కొందరు మాత్రం గుర్రాలను ఆ కొబ్బరితోటలోనే వదిలి, కోటకేసి పరి గెత్తుతున్నారు. ఆసరికి కోట కుండలినీ సైని కులవశం అయిపోయింది. రాజప్రాసాద ప్రాంతంలో యింకా ఎదిరిస్తున్న కొద్దిమంది మరాళ సైనికులు మాత్రం వున్నారు.

మందరదేవుడికీ, అతడి సైనికులకూ స్వల్పమైన దెబ్బలు తప్ప ప్రమాదకర మైన గాయాలేమీ తగలలేదు. కాని అందరూ బాగా డస్సిపోయివున్నారు.

మందరదేవుడు కత్తి ఒరలో పెట్టి "ఇకమనం జాగుచేయటం క్షేమంకాదు," అంటూ తీరం దగ్గిర వున్న పడవలకేసి బయలుదేరాడు. నలుగురు సైనికులూ ఒకసారి తలలుఎత్తి కోటప్రాంతంకేసి చూసి తమరాజును అనుసరించి నడిచారు.

ద్రోహి అయిన అంగరక్షకుడు చెప్పి నట్టుగా రెండు పడవలైతే సముద్రతీరాన వున్నవికాని—అవి సముద్రంమీద దూర ప్రయాణానికి పనికివచ్చేవి కావు. అవి చాలా చిన్న పడవలు. తెరచాపల్లాంటి సాధనాలతో కాక కేవలం తెడ్ల సహాయం తోనే వాటిని నడపవలసివుంటుంది.

మందరదేవుడు పడవలను సమీపించి హఠాత్తుగా ఏదో ఆలోచన వచ్చినవాడులా సైనికులకేసి చూసి తల పంకించాడు.

—(ఇంకావుంది)





# సమస్యా పూరణం

కాశీనగరంలో విలోచనకవి అని ఉండేవాడు. ఆయనే కాక ఆయన భార్యా, కొడుకూ, కోడలూకూడా గొప్పగా కవిత్వం చెప్పగలవారు. విలోచనకవి సకుటుంబంగా యాత్రలుచేస్తూ, కవిత్వమంటే చెవి కోసుకునే భోజరాజు దర్శనం చేసుకుందామని ధారానగరం చేరి భోజరాజు ఆస్థానానికి వెళ్ళాడు.

వచ్చినవారు నలుగురూ కవులని విని, భోజరాజు వారికి ఉచితాసనాలిచ్చి కూర్చోబెట్టి, ఈ కింది సమస్య ఇచ్చాడు:

"క్రియా సిద్ధి స్సత్త్వే భవతి మహతాం,
నోపకరణే."

ప్రతిభావంతులైనవారు తమ శక్తిచేతనే పనులు సాధిస్తారుగాని, పరికరాలమీద ఆధారపడరని ఈ సమస్యయొక్క భావం. భోజరాజు శ్లోకంలో ఒక పాదమే చదివాడు. మిగిలిన పాదాలు పూర్తిచేయటం అవతలివారి వంతు. సమస్యకూ మిగిలిన శ్లోకానికీ భావం చక్కగా కలవాలి.

భోజుడిచ్చిన సమస్యను విలోచనకవి ఈ విధంగా పూర్తిచేశాడు:

"ఘటో జన్మస్థానం, మృగపరిజనో,
భూర్జవసనో,
వనే వాసః, కందాదిక మశన,
దేవంవిధగుణః,
అగస్త్యః పాథోధిం యదకృత
కరాంభోజకుహరే,
క్రియా సిద్ధి స్సత్త్వే భవతి మహతాం,
నోపకరణే."

ఈ శ్లోకానికి తాత్పర్యం ఏమంటే: అగస్త్యుడు కుండలో పుట్టాడు, అడవిలో, నారబట్టలు ధరించి, మృగాలే పరివారంగా, కందమూలాలు తింటూ బతికాడు. ఆయన ఇటువంటివాడైకూడా సముద్రాన్ని దోసిట పట్టి తాగేశాడుగనక, ప్రతిభావంతుడు

జె. గంగాధరశర్మ




కార్యసాధన చెయ్యటానికి శక్తే ప్రధానం గాని పరికరాలు కావు.

ఈ శ్లోకం విని సంతోషించి భోజరాజు విలోచనకవికి ఒక రత్నం బహూకరించాడు. తరవాత అయన విలోచనకవి భార్యకేసి తిరిగి, "అమ్మా, ఈ సమస్యను మీరెలా పూరిస్తారు ?" అని అడిగాడు.

విలోచనుడి భార్య వెంటనే ఈ కింది శ్లోకం చెప్పింది :

"రథ స్యైకం చక్రం,

భుజగనమితా స్స ప్తతురగా,

నిరాలంబో మార్గః, చరణ వికల

స్సారథిరపి,

రవిర్యాత్యే వాంతం ప్రతిదిన

మపారస్య నభసః,

క్రియా సిద్ధి స్స త్త్వే భవతి మహతాం,

నోపకరణే."

దీని అర్థమేమిటంటే—సూర్యుడికి ఒకే చక్రం గల రథం, పాములతో పూన్చిన ఏడు గుర్రాలు, దారి చూడబోతే ఆధారం లేని ఆకాశమార్గం, సారథి తొడలు లేని అనూరుడు. ఇలా వుండికూడా సూర్యుడు అంతు లేని ఆకాశంలో వస్తూ, పోతూ ఉన్నాడు గనక, ప్రతిభావంతులు కార్య సాధన చెయ్యటానికి శక్తి ప్రధానంగాని పరికరాలు కావు.

భోజరాజామెకు పన్నెండు రత్నాలు బహూకరించి, విలోచనకవియొక్క కొడుకును చూసి, "నాయనా, సమస్యను నువ్వెలా పూరిస్తావు ?" అన్నాడు.

విలోచనకవియొక్క కొడుకు ఈ కింది శ్లోకం చెప్పాడు :

"విజేతవ్యా లంకా, చరణ తరణీయో

జలనిధిః,

విపక్షః పౌలస్త్యో, రణభువి

సహాయాశ్చ కపయః,

పదాతి ర్మర్త్యో సౌ సకలమవధీ

ద్రాక్షసకులం

క్రియా సిద్ధి స్సత్త్వే భవతి మహతాం,
నోపకరణే."

దీని అర్థమేమిటంటే—జయించవలసినది లంక, సముద్రాన్ని కాలినడకన దాటవలిసి వుంది, శత్రువు చూడబోతే పులస్త్య బ్రహ్మ సంతతివాడైన రావణుడు, సహాయానికి కోతులు తప్ప ఏమీ లేవు, తాను చూడబోతే మానవమాత్రుడు, కాల్బంటు అయికూడా రాముడు రాక్షస వంశాన్ని యావత్తూ నిర్మూలించాడుగనక, ప్రతిభావంతులకు కార్యసిద్ధి కలిగించేది శక్తే తప్ప పరికరాలు కావు.

భోజరాజు ఈ శ్లోకానికి పదహారేనుగులు బహుమతి ఇస్తూ, విలోచనకవి కోడలికేసి తిరికి, "నువ్వుకూడా సమస్య పూరిస్తావా, అమ్మా?' అని అడిగాడు.

వెంటనే ఆమె ఈ శ్లోకం చెప్పింది:

"ధనుః పౌష్పం, మౌర్వీ
మధుకరమయీ, చంచల దృశాం
దృశాం కోణో బాణః, సుహృ
దపి జడాత్మా హిమకరః,
స్వయం చైకో నంగః,
సకల భువనం వ్యాకులయతి
క్రియా సిద్ధి స్సత్త్వే భవతి మహతాం.
నోపకరణే."

దీని అర్థం: పూలతో చేసిన బాణానికి, తుమ్మెదల బారు నారిగా పెట్టుకుని, స్త్రీల చూపులనే బాణాలతో, జవసత్వాలు లేని చంద్రుడి ఆధారంతో, శరీరంకూడా లేని మన్మథుడు ప్రపంచాన్ని చెందుకు తింటున్నాడుగనక, ప్రతిభావంతులు కార్యసిద్ధికోసం తమ శక్తిపై ఆధారపడతారుగాని పరికరాలపై ఆధారపడరు.

ఈ శ్లోకం విని భోజరాజు పరమానందం చెంది, విలోచనకవి కోడలికి అంతులేని రత్నాభరణాలు బహూకరించాడు. సభలోనివారు కోడలు చెప్పిన శ్లోకంలో ఎక్కువ స్వారస్యం ఉన్నదని భావించారు.





# వ్యర్థ జీవితం

ఒక ఊళ్లో సకల విద్యలూ, సకల శాస్త్ర పురాణ ఇతిహాసాలూ చదివిన ఒక సద్బ్రాహ్మ డుండేవాడు. తాను గొప్పగా చదివినవాడి నన్న అతిశయంతోబాటు, ఎక్కువ చదువు కోనివారిమీద ఆయనకు అలక్ష్యభావంకూడా ఉండేది. చెమటోడ్చి సంఘానికి అనేక విధాల సేవచేసే వ్యవసాయకులూ, పశు కాపర్లూ, వడ్రంగులూ, కమ్మర్లూ, సాలీలూ, కుమ్మరులూ మొదలైనవారి జీవితాలు కేవలం నిష్ప్రయోజనమైనవని ఆయన అనుకుంటూండేవాడు.

ఒకనాడీ బ్రాహ్మడు నదిదాటి ఏటవత లికి వెళ్లవలిసి వచ్చింది. ఏటి అవతలకూ, ఇవతలకూ జనాన్ని చేర్చటానికిగాను ఒక పడవ ఉండేది. ఆ పడవను నడిపేవాడు రాత్రింబగళ్ళు విధివిరామంలేకుండా పని చేస్తూ, జీవితమంతా ఈ పనిలోనే గడిపాడు.

నది దాటటానికి బ్రాహ్మడు పడవ ఎక్కాడు. ఇంకా ఎవరైనా వస్తారేమోనని కాస్సేపు చూసి, ఎవరూ రానందున పడవ వాడు తెడ్డువేసి పడవను నది దాటించ నారంభించాడు.

బ్రాహ్మడు కాస్సేపు పడవవాడి కేసి చూసి, "నీది ఎంత నిరర్థకమైన బ్రతుకు!" అన్నాడు. వాడు చేస్తున్న శరీరశ్రమ చూస్తే వాడి మీద రోత పుట్టింది బ్రాహ్మడికి.

"అదేం, బాబూ? అట్లాగన్నారు?" అన్నాడు పడవవాడు.

"నీకు శాస్త్రాలేమైనా తెలుసా?" అని అడిగాడు బ్రాహ్మడు.

"నాబోటిగాడికి శాస్త్రాలెలా తెలుస్తాయి, బాబూ?" అన్నాడు పడవవాడు.

"ఇకనేం? నీ జీవితం సగం వృథా!... పోనీ పురాణాలేమైనా విన్నావా?" అన్నాడు

టి. శివరామయ్య

బ్రాహ్మడు, మిగిలిన సగం జీవితం ఎట్లా ఉన్నదీ తెలుసుకుందామని.

"అస్తమానం ఈ చాకిరీ తోనే సరిపాయె. పురాణాలు వినటానికి నాకు తీరికెక్కడ, బాబూ?" అన్నాడు పడవవాడు.

"చూశావామరీ? నీ జీవితంలో మూడు పాళ్ళు వృథా!...కనీసం కావ్యాలన్నా చదువుకున్నావా?" అన్నాడు బ్రాహ్మడు.

"సరిపోయింది! నాకు మొదలు చదవటమే రాదు. నేను కావ్యాలెట్లా చదివేది, బాబూ?" అన్నాడు పడవవాడు.

"ఇంకేముంది? నీ జీవితం పథ్నాలుగు వీసాలు వృథా. నువు రెండు వీసాలు మాత్రమే జీవిస్తున్నావు!" అన్నాడు బ్రాహ్మడు పెదవి విరుస్తూ.

ఏరీవిధంగా మాట్లాడుకుంటూ ఉండే సమయంలో, ఏటిగాలి సాగింది. నది భయంకరంగా పొంగి రాసాగింది. నదిలో భయంకరమైన అలలు లేవసాగాయి.

ఆకాశాన కారుమబ్బులు కమ్మి వాన ప్రారంభమయింది.

పడవ నదిమధ్యానికి చేరింది. అలలు దాన్ని ఇటూ అటూ విసిరేస్తున్నాయి. ప్రవాహం దాన్ని ముందుకు ఈడ్చేస్తున్నది. తెడ్డు వేసి పడవ నడపటం పడవవాడికి అసాధ్యమయిపోయింది. పడవలోకి నీరు వచ్చి కొంచెం, కొంచెమే పడవ మునిగిపోతున్నది.

"ఏమోయ్, అబ్బీ! పడవ మునిగేట్టుందే?" అన్నాడు బ్రాహ్మడు, గాభరా పడిపోతూ.

"చిత్తం, బాబూ! ఇంతకూ తమకు ఈదటం వచ్చా?" అన్నాడు పడవవాడు.

"నాకది రాదే!" అన్నాడు బ్రాహ్మడు.

"అయితే, బాబూ, తమ జీవితం పూర్తిగా వృథా!" అంటూ పడవవాడు నీళ్ళల్లోకి దూకి, అలలమీదగా యీదుకుంటూ ఒడ్డుకు వెళ్ళిపోయాడు.






# అత్తనుజయించినకోడలు

పూర్వం ఒక ఊళ్ళో ఒక యువకుడుండే వాడు. అతనికి పెళ్ళి అయి, పెళ్ళాం కాపరానికి వచ్చింది. కాని అతని తల్లి పరమ దుర్మార్గురాలై, కోడల్ని నానా బాధలూ పెట్టేది. ఆఖరుకు కడుపునిండా భోజనమైనా చెయ్యనిచ్చేదికాదు.

వాళ్ళ దొడ్లో కాకరపాదుండేది. అత్త రోజూ కాకరకాయలు కోసి, తనకూ తన కొడుక్కూ సరిపడినంతే వండి, కోడలికి ఒక్క ముక్క దక్కనిచ్చేదికాదు. అసలే కోడలికి కాకరకాయలంటే ఇష్టం. తినే టందుకు లేకపోవటంచేత ఈ ఇష్టం రెట్టింపయింది. కాని, ఏంచేస్తుందీ? మొగుడితో మొత్తుకుంటే యేమీ లాభంలేదు. ఎందుకంటే, వాడు వట్టి చవట. తల్లికి ఎదురు చెప్పలేడు.

ఇలా వుండగా ఒకనాడు అత్త ఊళ్ళోనే కాపరంచేస్తున్న కూతురు ఇంటికి బయలుదేరి వెళ్ళింది. ఇదే సమయ మనుకుని, కోడలు పాదున వున్న కాకరకాయలు ఇన్ని కోసి సలక్షణంగా కూర చేసి అన్నం వండుకుంది.

అక్కడ, కూతుర్ని చూడబోయిన అత్తను వియ్యాలవారు భోజనంకూడా పెట్టకుండా ఇంటికి పంపించేశారు. చేసేది లేక అత్త మళ్లీ ఇంటికి వచ్చి తలుపు తట్టి కోడల్ని కేకవేసి పిలిచింది.

కోడలు, పాపం, విస్తట్లో అన్నమూ, కూరా పెట్టుకుని తినబోతూండగా, అత్త కేక వినిపించింది. కోడలు తన ప్రారబ్ధాన్నీ, అత్తనూ తిట్టుకుని విస్తరి ఎత్తి ఖాళీ బిందెలో పెట్టి, బిందె చంకన పెట్టుకుని వెళ్లి అత్తకు తలుపు తీసి, అటునుంచి అటే నీళ్ల బావికి వెళ్ళింది.

స్వర్గానికి పోయినా వడేకులు తప్పనట్టు, మిట్టమధ్యాన్నంవేళ అయినా నీళ్ళబావి

పి. నారాయణరావు

దగ్గిర ఇంకా చాలామంది అమ్మలక్క లున్నారు. వాళ్లు చూస్తుండగా బిందెలో ఉన్న అన్నమూ కూరా తిన్నట్టయితే, డప్పే సుకుని వాళ్లు ఊరంతా చాటే మాట నిజం, తన అత్తగారికి తెలిసే మాటా నిజం.

అందుకని కోడలు, ఆ సమీపంలో వున్న అమ్మవారి గుడికి వెళ్ళింది. గర్భ గుడిలో తలుపు బిగించుకు కూచుని బిందెలోనుంచి విస్తరి తీసి, కూరన్నం పెద్ద పెద్ద ముద్దలు చేసి మిగమింగింది.

ఇది చూసి విస్తుపోయి అమ్మవారు ముక్కుమీద వేలేసుకుని, అట్లాగే ఉండి పోయింది. ఈ సంగతి గమనించకుండానే, కోడలు అన్నమంతా తినేసింది. ఆమె బావికి వెళ్ళి, బిందెలో నీళ్ళు చేదుకుని, ఇంటికి తిరిగి వెళ్ళిపోయింది.

ఆ సాయంకాలం పూజారి మామూలు ప్రకారం అమ్మవారి గుడికి వచ్చి, అమ్మ వారు ముక్కుమీద వేలుచూసి కొయ్యబారి పోయాడు. కొంతసేపటికా అర్చకుడు స్పృహ తెలుసుకుని గబగబా రాజుగారి దగ్గిరికి వెళ్లి మొరపెట్టుకున్నాడు.

"మహారాజా! ఘోరం! దేశానికి పెద్ద కీడు కలిగింది!" అన్నాడు పూజారి గాభరా పడుతూ. "ఏం జరిగింది?" అన్నాడు రాజు.



"అమ్మవారు ముక్కుమీద వేలేసు కుంది!" అన్నాడు పూజారి.

ఈ వింత చూడటానికి రాజుగారు సకు టుంబంగా బయలుదేరి వచ్చాడు. ఈలోపల ఊళ్ళోవారంతా గుడిదగ్గిర చేరారు. అమ్మవారి ముక్కుమీది వేలు చూసి అందరూ ముక్కుమీద వేలేసుకున్నారు.

"ఇది నిజంగా దేశానికి చెరుపే! అమ్మ వారి ముక్కుమీదినుంచి వేలు దించిన వారికి వెయ్యిన్నూట పదహార్లు ఇప్పిస్తాను" అన్నాడు రాజు.

ఎందరో ప్రయత్నించారు కాని యేమీ లాభం లేకపోయింది. కోడలు రాజుగారి



పడింది. రాజు కోడలికి వెయ్యిన్నూట పదహార్లూ, పసుపూ, కుంకం, చీరా, రవికా మొదలైనవి పంపించాడు. ఇక ఊళ్ళో వాళ్ళిచ్చిన కానుకలకు లెక్కేలేదు.

అది మొదలు ఊళ్ళోవాళ్లు అమ్మవారి జాతర్లు మాని కోడిపుంజుల్నీ, గొర్రె పొటేళ్ళనూ కోడలికే ఇచ్చిపోసాగారు. ఇవన్నీ చూస్తున్న అత్తగారికి కోడలిమీద ఈర్ష్యతో పాటు భయంకూడా పట్టుకుంది.

అవిడ ఒకనాడు కొడుకును పిలిచి, వాడితో రహస్యంగా, "నీ పెళ్ళాం మహా శక్తిరా, నాయనా! దానితో నువ్వేం కాపరం చేస్తావు? దానికి కోపం వచ్చిందంటే నిన్నూ నన్నూకూడా విరుచుకుతింటుంది!" అని అదుర్దాగా అన్నది.

"నేనేం చేసేదమ్మా? అదివరకు నాకు నువ్వంటేనే భయంగా ఉండేది. ఇప్పుడు అది అన్నా హడలుగానే ఉంది!" అన్నాడు కొడుకు పిచ్చిమొహంవేసి.

"కనకనే మనం యుక్తిగా దాన్ని మారణహోమం చేసేద్దాం. ఆతరవాత నీకు బుద్ధిమంతురాల్ని చూసి మళ్ళీ పెళ్ళి చేస్తాలే!" అన్నది తల్లి.

"నీ యిష్టం, నువ్వేం చెయ్యమంటే అది చేస్తాను," అన్నాడు కొడుకు.

దగ్గిరికి వెళ్ళి, అమ్మవారి ముక్కుమీదివేలు తాను దింపిస్తానన్నది. రాజు సరేనన్నాడు.

కోడలు ఉత్తబిందె తీసుకుని అమ్మవారి ఆలయానికి వెళ్ళింది. గర్భగుడి తలుపు మూసి, బిందె పైకెత్తి, అమ్మవారి దగ్గిరికి వెళ్ళి, "మొగుటిచాటు పెళ్ళాలుంటారు, అత్తచాటు కోడళ్లుంటారు. నువ్వేం ఆడపుట్టక పుట్టలేదా? ఒకర్ని చూసి ముక్కున వేలేసుకునే మాయరోగమేం? వేలు దించుతావా? బిందెతో నెత్తిన ఒక్కటి పెట్టనా?" అని అడిగింది.

వెంటనే అమ్మవారు ముక్కుమీది వేలు దించేసింది. పూజారి ప్రాణం కుదుట

ఒకనాడు రాత్రి కోడలు నిద్రపోతుండగా తల్లీ కొడుకులు చేరి దాని చేతులూ, కాళ్లూ కట్టేశారు. అరవకుండా దాని గొంతులో గుడ్డలు పెట్టారు. తరవాత దాన్ని ఒక చాపలో చుట్టి శ్మశానానికి మోసుకుపోయారు.

కొడుకు శ్మశానంలో దొరికిన పుల్లలూ, మండలూ పోగుచేసి తెచ్చి కాష్టం పేర్చాడు. కాని నిప్పు లేదు. సమయానికి శ్మశానంలో శవంకూడా ఏదీ కాలటంలేదు.

"నువు ఇంటికి పోయి నిప్పు పట్టుకురా!" అన్నది తల్లి.

"నే నొక్కణ్ణీ వెళ్లలేను, ఈ చీకటంటే నాకు భయం!" అన్నాడు కొడుకు.

"అయితే నే వెళ్ళి తీసుకొస్తా, నువ్విక్కడే ఉండు!" అన్నది తల్లి.

"నే నొక్కణ్ణీ ఉండలేను, భయం!" అన్నాడు కొడుకు.

చేసేది లేక ఇద్దరూ ఇంటికి బయలుదేరారు. ఈ సమయంలో కోడలు, మెల్లిగా చేతికట్టు విడిపించుకున్నది. చాపలోనుంచి బయటికి వచ్చింది. కాళ్లకట్లు ఊడదీసుకున్నది. ఒక ఈతబొండును చాపలో చుట్టి, మళ్ళీ చుట్టను చితిమీద పెట్టి, తానొక చెట్టుమీద ఎక్కి కూచుంది.

కొంచెంసేపటికి తల్లీ కొడుకులు తిరిగి వచ్చి, చితి అంటించి, వెళ్లిపోయారు.



మరి కాస్సేపటికి ఇద్దరు దొంగలు, ఎక్కడో నగలూ, బట్టలూ, డబ్బూ దొంగ తనం చేసివచ్చి, కోడలు ఎక్కివున్న చెట్టు కింద ఆగి, చితివెలుగులో సొమ్ము పంచుకో సాగారు. ఈ సమయానికి చెట్టుమీద వున్న కోడలు నిద్రమత్తున తూలి ఆ దొంగలపైన దభీమని పడింది.

"అమ్మో, బ్రహ్మరాకసి!" అని దొంగ లిద్దరూ శరవేగంతో చెరొక దారినా పారి పోయారు. వాళ్లు వదిలిపెట్టిన నగలన్నీ కోడలు మెడలో వేసుకుంది. ఉన్న చీరెలలో మంచిది తీసి కట్టుకుని, తాను కట్టుకున్న చీరె విప్పి చితిలో వేసేసింది. మిగిలిన బట్టలూ, సొమ్మూ తీసుకుని తెల్లవారేలోపుగా ఇంటికి పోయి తలుపు తట్టింది.

తలుపు తెరిచిన అత్తగారు కోడల్ని చూసి దయ్యమనుకుని కెవ్వున కేకపెట్టి పడిపోయింది. కోడలు అత్తకు ఉప చారాలుచేసి ఏదోవిధంగా స్పృహ తెప్పించి, "భయపడ కత్తయ్యా! నేను దయ్యాన్ని కాను. మీరు తగలబెట్టి నాక యమదూతలు వచ్చి నన్ను పట్టు కెళ్లారు. యముడు నన్ను చూసి దూత లను కోప్పడ్డాడు. 'అత్తను తీసుకు రమ్మంటే కోడలి నెందుకు తెచ్చారు?' అని అడిగాడు. నేను యమధర్మరాజును బతి మాలి, 'మా అత్త ఇకమీదట బుద్ధిగా వుంటుంది. ఆవిడను అప్పుడే తీసుకు రాకండి,' అన్నాను. యముడు చివరకు బలవంతాన ఒప్పుకున్నాడు. తరవాత యములవాళ్లు నాకీ నగలూ, బట్టలూ పెట్టి మన ఇంటి బయట దిగబెట్టారు. ఇదీ జరి గిన సంగతి," అన్నది.

ఆ నాటినుంచీ కోడల్ని ఏమన్నా అంటే యమదూతలు వచ్చి తనను పట్టుకుపోతా రేమోనని అత్తకు తగని భయంగా వుండేది. అందుచేత ఆమె కోడల్ని చాలా మంచిగా చూడసాగింది.






కౌశాంబీనగరం రాజధానిగా గల మాళవ దేశానికి ఒకప్పుడు ధర్మపాలుడు రాజయినాడు. ఆయనకు అనుభవం గల మంత్రులిద్దరుండేవారు. ఒకడి పేరు విజయకేతుడు. రెండవవాడి పేరు విహారభద్రుడు.

కొత్తగా రాజ్యాభిషిక్తుడైన ధర్మపాలుడు తన మంత్రులను వేరువేరుగా తన రహస్య మందిరానికి పిలిపించి, "నా పరిపాలన సరిగా వుండాలంటే నేను పాటించవలసిన ప్రధాన నీతి ఏది?" అని అడిగాడు.

ఈ ప్రశ్నకు విజయకేతు డీవిధంగా చెప్పాడు:

"రాజా, అన్నిటిలోకీ ప్రధానమైనది దండ నీతి. అగ్నిచేత బంగారానికి కాంతి వచ్చినట్టు, సమ్మెటదెబ్బలచేత ఇనుముకు బలం వచ్చినట్టు, దండనీతి ద్వారా పరిపాలన ప్రకాశిస్తుంది. ప్రజలకు హాని సోకదు. వారు సుఖపడతారు."

తరువాత విహారభద్రుడుకూడా వచ్చి ఈ విధంగా చెప్పాడు:

"రాజా, పరిపాలన దుస్తరమైనది. ఆదర్శంగా పరిపాలించే రాజుకు నిద్రాహారాలుకూడా ఉండవు. అందుచేత బుద్ధిమంతుడైన రాజు పరిపాలనా భారాన్ని సమర్థులైన మంత్రులపై వదలి, తనివి దీర సుఖా లనుభవించాలి."

రాజు ఆశ్చర్యపడి, "మరి రాజనీతి మాట?" అన్నాడు.

"రాజా, నీతి పుస్తకాలలో ఉంటుంది. తమ సుఖంకోసం నీతిని వ్యాసపరాశరుల వంటి వారే ఉల్లంఘించారు. మనవంటి మానవమాత్రు లెంత? నీవు చిన్నవాడవు. ఈ యౌవనమూ, రాజభోగాలూ శాశ్వతమా? కావాలంటే మళ్లీ వస్తాయా? అందుకని ఉండగానే వీటిని సార్థకం చేసుకోవాలి," అన్నాడు విహారభద్రుడు.

ఎస్. మాణిక్య ప్రసాద్





వేటా, తాగుడూ మొదలైన వ్యసనాలలో మునిగిపోయాడు. విజయకేతుణ్ణి పిలిచేవాడు కాడు, ఏ సలహా అడిగేవాడు కాడు.

పైకి చూడటానికి విహారభద్రుడిదే రాజ్యమన్నట్టు కనబడింది. ఆయన ఏ విషయమూ రాజుతో చెప్పేవాడు కాడు. అన్ని రాచకార్యాలూ తానే స్వయంగా చూసేవాడు. ఆయనద్వారా అన్యాయం జరిగినవారు రాజుతో మొరబెట్టుకునేటందుకు కూడా లేదు. విహారభద్రుడి ఆదరం లభించినవారు విశృంఖలంగా ప్రవర్తించ నారంభించారు.

"దండనీతిగురించి నీ అభిప్రాయ మేమిటి?" అని అడిగాడు రాజు.

"విష్ణుగుప్తుడు సంగ్రహపరిచిన దండనీతి చూసినా ఆరువేల శ్లోకాలున్నవి. అదంతా వల్లెవేసినా దానికి భాష్యం చెప్పటానికి బోలెడంత శబ్దశాస్త్రం చదవాలి. అప్పటికీ ఒకరు చెప్పే అర్థాలు మరొకరు ఒప్పరు. మనం లోకవృత్తం అనుసరించి పోవలిసిందేగాని, శాస్త్రాలవల్ల కొంచెంకూడా పని కాదు," అన్నాడు విహారభద్రుడు.

ధర్మపాలుడికి ఈ సలహా నచ్చినట్టు కనబడింది. ఆయన రాజ్యభారమంతా విహారభద్రుడికి వదిలిపెట్టి తాను జూదం,

క్రమంగా దివాణమంతా అరాజకమై పోయింది. ప్రజలలోకూడా జూదమూ, తాగుడూ మొదలైనవి హెచ్చిపోయాయి. వీటివెంటనే దొంగతనంకూడా ప్రబలింది. అయితే జూదరులూ, తాగుబోతులూ తమ అవసరాలకోసం చేసే దొంగతనాలకు శిక్ష కూడా ఉండేది కాదు. ఎందుకంటే న్యాయాధికారులు కూడా అటువంటి దురభ్యాసాలు కలవారే!

కౌశాంబీనగరంలోని అరాజకస్థితిని గురించి చోళదేశానికి వార్తలు వెళ్ళాయి. మామూలు పరిస్థితులలో చోళరాజు మాళవదేశాన్ని జయించలేడు. ఇప్పుడు పరిస్థితులు

మారటంవల్ల ఆయన తన మంత్రికొడుకును, వినీతుడనేవాణ్ణి కౌశాంబీకి పంపాడు. వాడు వచ్చి దివాణం పరిస్థితులన్నీ గమనించి, మెల్లిగా విహారభద్రుడి అండ చేరాడు. ఇద్దరూ కలిసి కుట్ర చేశారు.

ఒకనాడు విహారభద్రుడు వినీతుణ్ణి రాజు దగ్గిరికి తీసుకుపోయి, "రాజా, ఇతను చోళదేశపు మంత్రికుమారుడు. తన రాజు చేత అవమానం పొంది, పగబట్టి, మన ఆశ్రయం కోరి వచ్చాడు. మన శత్రువుకు శత్రువైనవాడు మన మిత్రుడేనన్న రాజనీతి ప్రకారం ఇతనికి మనం ఆశ్రయం ఇవ్వవచ్చు," అని రాజుతో చెప్పాడు.

రాజు దీనికి అంగీకరించాడు.

విజయకేతుడి కిది ఏమీ నచ్చలేదు. ఆయన రాజువద్దకు వెళ్ళి, "రాజా, ఈ వినీతుణ్ణి మనం పరీక్షించకుండా చేరనివ్వటం పొరపాటు. చోళరాజు మనదేశం మీద చాలా కాలంగా కన్నువేసి వున్నాడు. మనని జయించటం అలవి గాక కాలానికి కట్టుపడి ఉన్నాడు. ఈ వినీతుడు మన కోట రహస్యాలు చోళదేశానికి చేరవేస్తే మన పతనం తప్పదు," అని హెచ్చరించాడు.

"పిచ్చివాడా, మనమే చోళదేశపు రహస్యాలు వినీతుడిదగ్గిర తెలుసుకుందాం. నువ్వేమీ భయపడకు," అన్నాడు రాజు.





చూస్తూండగానే ధర్మపాలుడి ఆస్థానంలో వినీతుడు గొప్పవాడైనాడు. అతని పరివారం రోజు రోజుకూ మారుతూండేది. చోళదేశంనుంచి నిత్యమూ ఎవరెవరో వచ్చి వినీతుడి వెంట కొద్దిరోజులు తిరిగి మాయమై పోతూండేవారు.

"వీరంతా చోళరాజ్యం మనచేతికి రావటానికి ప్రాణాలొడ్డేవారే!" అని వినీతుడు రాజుతో చెబుతూవుండేవాడు.

ఈవిధంగా వచ్చినవారంతా చోళ సైనికులు. వారు ఒక్కరూ తిరిగిపోలేదు. వారందరినీ రహస్యంగా దాచటానికి వినీతుడు ఒక పెద్ద బ్రహ్మాండమైన ఇంటిని దివాణం ఖర్చుతోనే కట్టించాడు. దాని చుట్టూ ఎత్తయిన ప్రహరీగోడ నిర్మించాడు. దాని నిండా ఆయుధాలు చేర్పించాడు. వారిని రాజుగారి సొత్తుతోనే పోషించసాగాడు. కొద్దికాలంలోనే అయిదు వేల సైనికులు సమకూర్చబడ్డారు.

ఇదంతా విజయకేతుడు తన గూఢచారులవల్ల తెలుసుకుంటూనే ఉన్నాడు. వినీతుడి స్వంత ఖర్చుకింద అయే మొత్తాన్ని బట్టి అతను పోగుచేసిన సేననుకూడా ఆయన ఊహించగలిగాడు. రాజుగారితో చెప్పి ప్రయోజనం వుండదని విజయకేతుడు తాను తెలుసుకున్న విషయాలను రాణి అయిన సునందాదేవికి తెలియబరిచాడు. ఆవిడ అదంతా భర్తకు చెప్పేసింది.

ధర్మపాలుడు ఎన్నడూ విహారభద్రుణ్ణి పూర్తిగా నమ్మలేదు. అయితే తాను యువకుడూ, రాజ్యానుభవం లేనివాడూ కావటంచేత తన మంత్రులిద్దరిలో తన మేలు కోరిన దెవరో తెలుసుకోవటానికి ఇంతకాలంనుంచీ అమాయకుడులాగా నటించాడు. ఇప్పుడు తాను జోక్యం కలిగించుకునే సమయంవచ్చింది.

ఇలాంటి సమయంకోసమే రాజు ఎంతో కాలంగా ఎదురుచూస్తున్నాడు.

మర్నాడు సభకు రాగానే ధర్మపాలు డిలో చాలా మార్పు కనిపించింది. ఆయన విహారభద్రుణ్ణి పిలిచి, "మంత్రీ, రాజ్యాంగ మంతా ఇంతకాలమూ నువే చూస్తున్నావు. ఇవాళ నేను చూస్తాను," అన్నాడు.

విహారభద్రుడు చమత్కారపు మాట లతో రాజు మనసు మళ్ళించజూచాడు కాని లాభం లేకపోయింది. రాజు ఖజానా పరి స్థితీ, రాబడీ ఖర్చూ, పన్నుల వసూళ్లూ, ప్రజలు చేసుకున్న విజ్ఞాపనలూ, వాటి విషయం జరిగిన చర్యలూ విచారించాడు.

"మంత్రీ, శత్రురాజులు మనపై వచ్చి పడితే వారు గెలవటానికి మన పరిస్థితి అనుకూలంగా వున్నది. దీనికేమంటావు?" అని అడిగాడు రాజు విహారభద్రుణ్ణి.

"రాజా, ఇప్పుడు మనకు యుద్ధ భయ మేమిటి?" అన్నాడు విహారభద్రుడు.

"చోళరాజు మనమీదికి పంచమాంగ బలాలతో ఎత్తి రాబోతున్న సంగతి నీకింకా తెలియలేదా?" అన్నాడు రాజు.

విహారభద్రుడు తెల్లబోయి, "పంచ మాంగ బలాలేమిటి, మహారాజా?" అన్నాడు. ఆనాటి సేనలలో రథ, గజ, తురగ, పదాతిబలాలుండేవి. వీటిని చతు రంగ బలాలనేవారు.



"చతురంగ బలాలతో చోళరాజు మన మీదికి వస్తాడు. పంచమాంగ బలం మన ఉప్పు తింటూ మన దేశంలోనే ఉన్నది. ఈ సంగతికూడా తెలియని నిన్ను మంత్రిగా ఉండనివ్వటం మంచిదికాదు," అంటూ రాజు ఆయన్ని అప్పటికప్పుడే ఖైదు చేయించి, విజయకేతుణ్ణి మంత్రిగా చేశాడు.

వెంటనే రాజూ, మంత్రీ కలిసి వినీ తుడు తన సైనికులకోసం కట్టించిన భవ నానికి వెళ్లారు. ఆ భవనం ఎవరిదని రాజు అడగగా అది వినీతుడిదేనని అక్కడి వారన్నారు. రాజు వెంటనే వినీ తుడికి కబురుచేసి, అతను వచ్చాక,

"ఈ భవనం నీదేనా? ఇంతపెద్ద భవనాన్ని ఎవరి అనుమతితో కట్టించావు? ఇందులో ఏమున్నది?" అని అడిగాడు.

"ఏలినవారికోసం మంత్రిగారు కట్టించ మంటే నేనే దగ్గరవుండి కట్టించాను. ఈ భవనం నాది కాదు. ఇందులో ఏమున్నదీ నాకు తెలియదు," అన్నాడు వినీతుడు.

"నాకు ప్రస్తుతం ఈ భవనంతో పని లేదు. అందుచేత దీని వాకిళ్ళూ, కిటికీలూ మూసివేసి, ఇటుకలూ, సున్నమూ పెట్టి గోడలు పెట్టించండి. ఈ భవనంలో ఏమున్నదీ తరువాత చూసుకుందాం. అంత దాకా వినీతుణ్ణి భద్రంగా చెరలో ఉంచండి," అన్నాడు రాజు.

ఒక్క పూటలో ఆ భవనం అయిదువేల శత్రు సైనికులకు గోరీ అయిపోయింది. వినీతుడు ఖైదీ అయిపోయాడు. కాని అదివరకే అతను పంపిన వార్తనుబట్టి చోళరాజు తన చతురంగ బలాలతో కౌశాంబీ కోటపైకి దాడెత్తి వచ్చాడు. దీని కంతకూ సిద్ధంగానే వున్న విజయకేతుడు శత్రుబలాలను కోటదాకా రానిచ్చి తన బలాలచేత వారి బలాలను చుట్టు ముట్టించాడు. కోట గోడలమీద ఉన్న సేనకూ, తమ వెనుక చేరిన సేనకూ మధ్య నలిగి చోళ బలాలు నాశన మయాయి. అనుకున్న ప్రకారం సమ యానికి కోటలోపల వున్న పంచమాంగ దళం ఎందుకు రాలేదో చోళరాజు ఊహించ లేకపోయాడు. ఆయన యుద్ధంలో పరా భవం పొంది ఎట్లాగో ప్రాణాలతో తప్పించు కుని తన దేశం చేరాడు.

ధర్మపాలుడు విహారభద్రుణ్ణీ, వినీతుణ్ణీ విచారణ జరిపించి వారిద్దరికీ ఉరిశిక్ష విధించాడు. వారి శవాలను కోటగోడకు తలకిందుగా వేలాడగట్టి, గోడమీద "పంచ మాంగ బల నాయకుల కిదే శిక్ష!" అని రాయించాడు.






# పనికిమాలినమూక

ఒక గ్రామంలో ధనికుడైన ఆసామీ ఒక డుండేవాడు. ఆయనకు నలుగురు కొడుకు లుండేవారు. నలుగురుకూడా యెందుకూ పనికిరాని పరమ మూఢులే. పెరిగి పెద్ద వాళ్ళయి పిల్లల్ని కనే వయసు వచ్చినా కూడా వాళ్ళు తల్లిచాటు పిల్లల్లాగా, తండ్రి చాటు పిల్లల్లాగా ప్రవర్తించుతూ, ఏ బాధ్యతా లేకుండా బతికారు.

ఇదిచూసి తండ్రి వారిపై బాధ్యతలు పడేసి, స్వతంత్రంగా బతకటం నేర్పాలని నిశ్చయించుకున్నాడు. ఒకనాడాయన పెద్ద వాణ్ణి పిలిచి, "నువు మీ మేనమామల ఊరికి పోయి అక్కడ అందరి క్షేమసమా చారాలూ తెలుసుకునిరా!" అన్నాడు.

వాడు మర్నాడు తెల్లవారుజామున బయలుదేరి వెళ్ళేటప్పుడు, తల్లి "నాయనా, ఆ వూరు అసలే నిప్పూ, నీరూ పుట్టని ఊరు. నువు అదేపనిగా అక్కడుండిపోక వెంటనే తిరిగివచ్చెయ్యి, మీ మామలు నాలుగు రోజులుండమంటే, తొందరపని ఉన్నదని చెప్పు," అన్నది.

పెద్దవాడు ఎవరికీ తెలియకుండా రెండు దుత్తలు సంపాదించి, ఒకదానిలో కొద్దిగా నిప్పూ, రెండోదానిలో నీరూ పోసుకుని మేన మామల ఊరికి బయలుదేరాడు. కొంత దూరం పోయాక రెండు దుత్తలు మోయటం వాడికి ఇబ్బంది అనిపించి, నిప్పున్న దుత్తలోనే నీళ్ళు పోసేసి ఖాళీ దుత్త అవతల పారేసి ప్రయాణం సాగించాడు. ఇప్పుడు వాడికి నడక బాగా సాగింది. త్వరలోనే మేనమామలు వుండే ఊరు చేరుకున్నాడు.

వాణ్ణి చూడగానే మేనమామలు, "ఆ దుత్త ఏమిట్రా ?" అని అడిగారు.

"మీ ఊళ్ళో నిప్పూ, నీరూ పుట్టవుటగా ? అందుకని వెంటతెచ్చాను" అన్నాడు వాడు.

ఆర్. విమలాకుమారి



"ఓరి నీ తెలివి తెల్లవారా! నిప్పేదీ? అని వాళ్ళు అడిగారు.

"నీళ్ళల్లోనే వుంది," అన్నాడు వాడు.

వాడి అమాయికత్వానికి మేనమామలు నవ్వుకుని, వాణ్ణి తిప్పి పంపేటప్పుడు, "చూడు, నాయనా! ప్రపంచం పాపిష్టిది. నువ్వెప్పుడూ ఒంటరిగా ఇల్లు కదలవద్దు!" అని సలహా ఇచ్చారు.

వాడింటికి తిరిగివచ్చి జరిగినదంతా తండ్రికి చెప్పాడు. తండ్రి వాడిమీద ఆశలు మానుకుని రెండో కొడుకును దగ్గరకు పిలిచి, "ఒరే, నాయనా! నువు వెళ్ళి మన పాలెంలో కాపరం పెట్టి ఈ యేడునుంచీ స్వయంగా దగ్గరఉండి వ్యవసాయం చూడరా!" అన్నాడు వాడితో.

"సరే, నాన్నా!" అని రెండోవాడు పాలెంలో కాపరం పెట్టి వ్యసాయంపనులు చూడసాగాడు. అక్కడి పొలాలలో నువ్వులు పండిస్తారు. అది నువ్వులు చల్లే తరుణం. అందుచేత రైతులు నువ్వుల బస్తాలు విప్పి సిద్ధంగా ఉంచారు.

అసామీ కొడుకు తోచక పచ్చినువ్వులు గుప్పిళ్ళతో తీసుకుని తినసాగాడు. ఇది చూసి ఒక రైతు అతనితో, "పచ్చివెందుకు తింటారు, బాబూ! కావలిస్తే వేపిస్తాను," అంటూ తన భార్యచేత ఒక శేరు నువ్వులు వేపించి యజమాని కొడుక్కు పెట్టించాడు. వాడు వాటిని తిని వాటి రుచికి ఆశ్చర్యపోయి. "ఇదుగో. ముందు ఈ బస్తాలలోని నువ్వులన్నీ వేపించండి," అని రైతులకు ఉత్తరువిచ్చాడు.

"మరి విత్తనాలకో?" అన్నారు రైతులు నిర్ఘాంతపోయి.

"నే చెబుతాగా!" అన్నాడు అసామీ కొడుకు అంతా తెలిసినట్టు.

పోనీ అతని ఇష్టప్రకారమే చేద్దామని నువ్వులన్నిటినీ రైతులు మంగలాల్లో పోయించి, వేపించారు.



"ఇక వీటిని తీసుకుపోయి పొలంలో చల్లండి. కమ్మని నువ్వులు కాస్తాయి. ఇంతకాలంగా వ్యవసాయం చేస్తున్నారు. పచ్చినువ్వులు చల్లి పచ్చినువ్వులు పండించటం తప్ప మీ కింకేమీ తెలీదు!" అన్నాడు అసామీ రెండో కొడుకు.

రైతులు అసామీదగ్గిరికి పరిగెత్తి జరిగినదంతా చెప్పారు. అసామీ తల బాదుకుని రెండో కొడుకును వెనక్కు పిలిపించాడు.

అసామీకి ఉన్న గ్రామంలోనే ఒక మూల పశువుల శాల ఉన్నది. అక్కడ పెత్తనం చెయ్యమని అసామీ తన మూడో కొడుకును నియోగించాడు.

వాడక్కడ కొన్ని రోజులున్న తరవాత ఒక గొప్ప ఆలోచన తట్టింది. వెంటనే వాడు పశువుల కాపర్లను అందరిని పిలిచి ఈవిధంగా చెప్పాడు:

"ఒరే, యింకో నెలకు సంక్రాంతి పండగ వస్తుందిట. మీరు ఈ నెలరోజులూ ఒక్క పశువునుకూడా పాలు పిండకండి. సంక్రాంతినాడు నెలరోజుల పాలూ ఒక్కసారి పిండేసి ఎక్కువ ధరకు అమ్మేద్దాం!"

ఈ మాటలు విని కొంతమంది నౌకర్లు నవ్వారు. మరికొంతమంది, "అది కుదిరే పని కాదులెండి, దొరా!" అని మర్యాదగా చెప్పిచూశారు.







కాని అసామీ కొడుకు మండిపడి, "నేను చెప్పినట్టు చెయ్యండి. యజమానిని నేనా, మీరా ?" అన్నాడు.

మనకెందుకు లెమ్మని వాళ్లు పశువులను పాలు పిండటం మానేశారు. సంక్రాంతి వచ్చేసరికి పశువులన్నీ వట్టిపోయాయి. పశు కాపర్లు జరిగినదంతా తమ యజమానికి విన్నవించారు. అయన తన మూడో కొడుకును ఇంటికి పిలిపించుకున్నాడు.

ఇప్పుడు అసామీ ఆశలన్నీ తన ఆఖరు కొడుకుమీద ఉన్నాయి. నిజానికి వాడు మిగిలిన ముగ్గురికంటె తెలివిగలవాడుగా కనపడేవాడు.

మిగిలినవాళ్ళకు చెప్పినట్టుగా ఆఖరువాడితో తండ్రి ఫలాని పని చెయ్యమని చెప్పక, "నువ్వేం చేద్దామనుకుంటున్నావురా, అబ్బాయ్ ?" అని అడిగాడు.

"నాకు వర్తకం చెయ్యాలని వుంది. నాన్నా!" అన్నాడు కడగొట్టువాడు.

"అయితే రెండు వేల రూపాయలు తీసుకుని వర్తకంచేసి డబ్బుసంపాదించుకురా!" అన్నాడు తండ్రి.

తండ్రి ఇచ్చిన రెండువేలూ పట్టుకుని ఆఖరు కొడుకు బస్తీకి వెళ్లాడు. అక్కడ రకరకాల సరకులు బేరంచేసి చివరకు గంధపు చెక్క కొని ఒక బండీమీద వేసుకుని బయలుదేరాడు.

ఆ బండీతో వాడు చాలా దేశం తిరిగాడు గాని సరుకు అమ్మకం కాలేదు. చివరకు ఒక ఊరు చేరి, "ఈ ఊళ్ళో ఏం బాగా అమ్ముతుంది ?" అని అక్కడివారిని కొందరిని అడిగాడు.

"అబ్బో! ఇవాళ బొగ్గుకున్న గిరాకీ మరి దేనికీ లేదు!" అన్నారు, వాళ్ళు.

"భేష్" అనుకుని అసామీ ఆఖరు కొడుకు, తన బండిమీది గంధంచెక్క యావత్తూ దింపి, దాన్ని బొగ్గుచేసి, అప్పటికప్పుడే పదిరూపాయలకు అమ్మేశాడు.

తరవాత వాడు బండిమీద మరొక ఊరికి వెళ్లి, అక్కడివాళ్ళని, "ఇక్కడ చౌకగా దొరికే సరుకేమిటి?" అని అడిగాడు.

"ఇంకేముందీ? దూది! ఏ ఇంటో అడిగినా దొరుకుతుంది!" అన్నారు ఊళ్ళో వాళ్ళు అతనితో.

అసామీ ఆఖరు కొడుకు తనదగ్గిర వున్న పదిరూపాయలతోనూ దూది కొని బండిమీద వేసుకుని ఒక బస్తీకి చేరి అక్కడ దూది అమ్మకానికి పెట్టాడు.

సరుకు చూసినవారల్లా, "కొందుము గాని దూది శుద్ధంగా లేదు, బాబూ!" అన్నారు. ఈ దూది ఇక ఎక్కడా అమ్ముడు పోదని తేలిపోయింది.

అసామీ కొడుక్కు యేం చెయ్యాలో పాలుపోలేదు. వాడు బండిని నడిపించు కుని వీధివెంట వస్తూ, కాస్సేపు విశ్రాంతి తీసుకుందామని అక్కడ కనిపించిన ఒక ఇంటి అరుగుమీద కూచున్నాడు.

ఆ అరుగుమీదే ఒక పక్కగా ఒక కమసాలి కొలిమిలో బంగారం పెట్టి గొట్టంతో ఊదుతూ కనిపించాడు.

"ఏమిటో చేస్తున్నారే కమసాలిగారు?" అన్నాడు అసామీ ఆఖరు కొడుకు.

"బంగారం నిప్పులో పెట్టి శుద్ధి చేస్తున్నాను, బాబూ!" అన్నాడు కమసాలి.

అసామీ ఆఖరు కొడుక్కు ఎక్కడలేని ఉత్సాహమూ వచ్చింది. అతను వెంటనే బయలుదేరి, బసకు వెళ్ళి, బండిమీది నుంచి దూదిబస్తాలు దింపించి, పెద్ద హోమగుండం తయారుచేయించి, దూదిని శుద్ధి చెయ్యటానికిగాను, బస్తాలన్నిటినీ ఆ గుండంలో పడేయించాడు.

దూదికాస్తా భగ్గున మండి నుసినుసి అయిపోయింది. అంతతో అసామీ ఆఖరు కొడుకు వర్తకం కూడా ఆఖరయింది. అసామీ తన కొడుకులమీద పెట్టుకున్న ఆశలుకూడా ఆఖరయాయి.






వత్సదేశానికి రాజధాని ఐన అమరావతీ నగరంలో, నరవాహనదత్తుడు పరిపాలన చేసే కాలంలో, వసుభరుడనే పేదవాడు బరువులు మోసి, జీవిస్తూండేవాడు.

ఇటువంటి గర్భదరిద్రుడికి ఒకనాడు రాచనగరు ద్వారం సమీపంలో రత్నాలు పొదిగిన కంకణం ఒకటి దొరికింది. వసుధరుడు దానిని తన ఇంటికి తిసుకుపోయి, కంకణంనుంచి ఒక రత్నం ఊడగొట్టి, హిరణ్యగుప్తుడనే రత్నవర్తకుడి దగ్గిరికి పట్టుకుపోయాడు.

హిరణ్యగుప్తుడు దానిని పరీక్షించి, "రత్నం మేలుజాతిది. నువు అమ్మేటట్టయితే లక్ష దీనారాలిచ్చి కొంటాను. అమ్మి డబ్బు వుంచుకుంటావా?" అని అడిగాడు హిరణ్యగుప్తుడు.

"అంత డబ్బు నేనుమాత్రం ఎక్కడ దాచేది, బాబూ? మీదగ్గిరే ఉంచండి. నాకు కావలిసినప్పుడల్లా వచ్చి తీసుకుంటూ ఉంటాను!" అన్నాడు వసుధరుడు.

తరవాత వాడు అయిదుసార్లుగా అయిదు వేల దీనారాలు తీసుకుని రాజభోగంగా తింటూ, తాగుతూ, మంచి బట్టలు వేసుకుని ఉల్లాసంగా తిరగసాగాడు.

అమరావతీ నగరంలోనే రత్నదత్తుడనే వర్తకుడున్నాడు. ఆయన వసుధరుడిచేత చాలా సార్లు సరుకులు మోయించుకున్నాడు. వాడు ఇటీవల తనవద్దకు రాకపోవటం రత్నదత్తుడు గమనించి, ఇతర కూలీలను అడిగితే, వాళ్ళు, "వాడిప్పుడు కూలి కెందుకు వస్తాడు, బాబూ? గొప్పవాడైపోయాడు. వాడి చేతిలో లక్ష్మి తాండవం చేస్తున్నది!" అని చెప్పారు

వసుధరుడికి సిరి ఎట్లా ఎత్తుకున్నదీ తెలుసుకోవాలని రత్నదత్తుడికి కోరిక కలిగింది. ఆయన వాణ్ణి మంచిగా పిలిపించి,

బి. అంకరాజు

"ఒరే, నీకు మంచిరోజులు వచ్చినట్టు విన్నాను. ఒకపూట మా యింట భోజనం చేసి వెళ్ళు. మనం మనం చాలాకాలపు స్నేహితులంగదా!" అన్నాడు.

వసుధరుడు ఒప్పుకున్నాడు. రత్నదత్తుడు వాడిచేత బాగా తాగించి, మంచి మాటలతో, వాడి రహస్యమంతా తెలుసుకున్నాడు. తరవాత రత్నదత్తుడు వసుధరుణ్ణి ఇంటికి పంపేసి, రాజుగారిదగ్గిరికి వెళ్ళి అంతా చెప్పేశాడు.

"మహాప్రభూ, అంత వెలగల కంకణం తమదే అయివుండాలి. విచారణ చేసి న్యాయంచేయాలి," అన్నాడు రత్నదత్తుడు.

ఈ మాట వినగానే నరవాహనదత్తుడికి తన కంకణం పోయిన సంగతి జ్ఞాపకం వచ్చింది. కొంతకాలంక్రితం ఆయన ఊరేగింపు వెళ్ళివచ్చాక చేతి కంకణం ఒకటి కనిపించలేదు. దానికోసం వెతికించమని ఉత్తరువుచేశాడు. తిరిగి దాని విషయం ఆయనకు జ్ఞాపకం రానేలేదు.

నరవాహనదత్తుడు కంకణంతోసహా వసుధరుణ్ణి ఆస్థానానికి పిలిపించాడు. కంకణం రాజుదే అని తేలింది. దానిమీద ఆయనగారి పేరుకూడా ఉన్నది. "దీని మీద మా పేరు వుండటం చూసికూడా




ఏమని నీ సొంతం చేసుకున్నావురా?" అని రాజు వసుధరుణ్ణి గద్దించి అడిగాడు.

"కూలిమాటలు మోసుకునేవాణ్ణి. నాకు దానిమీద ఏం రాసుందో ఎట్లా తెలుస్తుంది, దొరా?" అన్నాడు వసుధరుడు.

"పోనీ, ఇది ఎవరిదని నలుగుర్ని విచారించలేకపోయావా?" అన్నాడు రాజు.

"నావంటి పేదవాడిదగ్గిర ఇంత గొప్ప నగ ఎవరన్నా చూశారంటే ముందు దొంగతనం అంటగట్టి తరవాత మాట్లాడతారే!" అన్నాడు వసుధరుడు.

ఇదంతా వింటున్న వృద్ధమంత్రి యౌగంధరాయణుడు, "వాడు నిర్దోషి,

పోనివ్వండి! హిరణ్యగుప్తుడికి, రత్నంతో సహా రమ్మని కబురు పంపండి!'' అన్నాడు.

కొద్దిసేపట్లోనే హిరణ్యగుప్తుడు రత్నంతో సహా వచ్చాడు.

"ఏమయ్యా, ఈ కంకణంమీద మా పేరుండటం చూసికూడా యిందులోని రత్నాన్ని ఏమని కొన్నావు? నీవు దండనార్హుడివి కావా?'' అన్నాడు రాజు.

"ప్రభూ, నే నీ కంకణం యెన్నడూ చూడలేదు. వసుధరుడనేవాడు నాదగ్గిరికి ఈ రత్నంమాత్రం తెచ్చి అమ్మాడు. పేదవాడుగదా అని నేను అన్యాయం చేయలేదు. న్యాయమైన వెలకే దాన్ని కొన్నాను. వాడు నాదగ్గిర అయిదువేల దీనారాలు మాత్రమే పుచ్చుకున్నాడు. మిగిలిన సొమ్మంతా నావద్దనే ఉన్నది,'' అన్నాడు హిరణ్యగుప్తుడు.

"అంత పేదవాడికి యింత వెలగల రత్నం ఎలా వచ్చింది? దొంగలించాడేమో నని నీకు అనుమానం కలగలేదుటయ్యా?'' అన్నాడు రాజు.

"ప్రభూ, మా వృత్తి వర్తకం చేసుకోవటం, దొంగలను పట్టటం కాదు. మా ధర్మం మేము తప్పి నడిచినప్పుడు ప్రభువులు మమ్మల్ని దండించవచ్చు!'' అన్నాడు హిరణ్యగుప్తుడు.

"అతను నిర్దోషి. అయిదువేల దీనారాలూ తిరిగి ఇప్పించి, అతన్ని పంపించెయ్యండి! రత్నదత్తుణ్ణి ఒకసారి రప్పించండి,'' అన్నాడు యౌగంధరాయణుడు.

రాజుగారు బహూకరిస్తారని రత్నదత్తుడు ఉత్సాహంగా వచ్చాడు. కాని అతన్ని చూస్తూనే యౌగంధరాయణుడు, "ఏమయ్యా, నీ ప్రవర్తన మాకేమీ నచ్చలేదు. నీవు వసుధరుణ్ణి నమ్మించి మోసం చేశావు. కాని ఇది మొదటి తప్పు కనక క్షమిస్తున్నాము!'' అన్నాడు. రత్నదత్తుడు సిగ్గుతో తల వంచుకుని వెళ్ళిపోయాడు.



# నక్క వైరాగ్యం

ఒక నక్క ఒకనాడు ఏదో దొంగతనానికి పోతూంటే దారిలో ఒక ఊబిగుంట అడ్డుతగిలింది. దూకలేక పోతానా అనే అహంభావంతో నక్క వెనక్కు తిరిగి పోవటానికి మారుగా ఊబిగుంటమీదిగా దూకబోయి అందులో పడింది.



వెంటనే నక్క గిజగిజా తన్నుకొంటూ భయంకరంగా అరిచి, శాపనార్థాలు పెట్టసాగింది. ఈ శాపనార్థాలకూ, అరుపులకూ భయపడి చుట్టూ ఉండే కొండలూ, చెట్లూ, చేమలూ తనను రక్షిస్తాయని నక్క నమ్మకం. కాని ఈ ఎత్తు సాగలేదు.

తాను నోరు పారేసుకోవటంవల్ల, లభించదగిన సహాయంకూడా రాకుండా పోతున్నదేమోనని నక్కకు అనుమానం కలిగింది. అందుచేత అది గొంతు తగ్గించి, "ఒకరివల్ల ఈపని జరిగిందని నేనుమాత్రం అంటానా? అయితే మటుకు, ఎవరైనావచ్చి ఈ పరిస్థితి ఏమిటో కాస్త చూడగూడదూ?" అన్నది.

అప్పటికీ ప్రయోజనం కలగలేదు. చివరకు నక్క విరక్తిగా, "సరే పోనీ, జరిగేది జరుగుతుంది. ఈ ప్రపంచంలో ఏది శాశ్వతం?" అనుకున్నది.

# పలుపు భ్రాంతి

ఒక ఆవుకు స్వేచ్ఛమీద కాంక్ష పుట్టింది. ఒక కుక్క సహాయంతో అది నిర్బంధంనుండి బయటపడదామనుకుంది. రాత్రిపూట ఆవును విడిపించటానికి కుక్కవచ్చింది. అది ఆవు పలుపు తాడు కొరకబోయింది.

"చూడు, తమ్ముడూ! చక్కని పలుపు తాడు. నాకున్న ఆస్తి అదే. కొరకమాకు. తాడును గుంజనుంచి విప్పెయ్యి. వెంటపెట్టుకుపోతాను!" అని బతిమాలింది ఆవు.



కుక్క అలాగేచేసింది. ఆవు పారిపోయింది అయితే అది ఎంతోదూరం పోలేదు. రోడ్డుపక్కనఉన్న బండరాయికింద పలుపు ఇరుక్కుని ఆవు కదలలేకపోయింది. ఇంతలో యజమాని రానేవచ్చి ఆవును మళ్ళీ ఇంటికి తోలుకు వెళ్ళాడు.

## కాకిశాసనం

కాకికి రాజవుదామనిపించింది. రాజు కావాలంటే రాజ్యం ఉండాలి కద. అగకుండా ఎగరగలిగినంత మేర ఒకచుట్టు ఎగిరివచ్చి, ఆ వలయంలో ఉన్న భూమీ, చెట్లూ, ఆకాశమూ తన రాజ్యమని కాకి ప్రకటించింది. "నా రాజ్యంలో మరే ఇతర పక్షి నడవరాదు, ఎగరరాదు, గూడు కట్టరాదు," అని శాసించింది కాకి.



కాని ఇతర పక్షులీ శాసనాన్ని లక్ష్యపెట్టలేదు. అవి మామూలుప్రకారమే కాకిరాజ్యంలో ఎగిరాయి, నడిచాయి, గూళ్ళుకట్టాయి. కాకి తన శాసనాన్ని అమలుచేసుకోలేక దేబెమొహం వేసింది.

"సరే, కానివ్వండి. మీకు ప్రత్యేక హక్కులిచ్చాను. మీరుమటుకు నా రాజ్యంలో ఎగరవచ్చు, నడవవచ్చు, గూళ్ళు కట్టుకోవచ్చు." అన్నది కాకి.

ఇంకా అనేక పక్షులువచ్చి కాకిరాజ్యంలో గూళ్ళుకట్టసాగాయి.

"ఇకనుంచీ నా రాజ్యంలో ఏ పక్షిఅయినా నడవవచ్చు, ఎగరవచ్చు, గూళ్ళు కట్టుకోవచ్చు. నాది అంత ఉదారమైన హృదయం!" అన్నది కాకి.

## మనిషీ, గాడిదా

కైరోనగరంలో గోహా అనే విదూషకుడుండేవాడు. అతను ఎన్నడూ కాయకష్టం చేసి ఎరగడు. అతని హాస్యం చూసి అందరూ ఆదరించేవారు.

ఒకరోజు ఒక మిత్రుడు గోహావద్దకు వెళ్ళి, "గోహా, నేను దీర్ఘప్రయాణం మీద పోతున్నాను. నాకు నీ గాడిదను అరువిస్తావా?" అని అడిగాడు. గోహా విచారంగా ముఖం పెట్టి, "ఇద్దునుగాని, ఇటీవలనే నా గాడిదను అమ్మేశానే!" అన్నాడు. ఇంతలోనే దొడ్డిలో ఉన్న గాడిద ఓండ్రపెట్టనారంభించింది.

"అదుగో, గాడిద! దాని అరుపు వినిపిస్తుంటేనే?" అన్నాడు మిత్రుడు, గోహా తనతో అబద్ధమాడినందుకు నొచ్చుకుంటూ.

గోహా సిగ్గుపడటానికి మారుగా ఆశ్చర్యపోతూ, "ఏమిటీ? నీకు చదువుకున్న నా మాటలోకన్న గాడిదమాటలో ఎక్కువ విశ్వాసమా? ఎటువంటి స్నేహితుడివి?" అన్నాడు. మిత్రుడు సిగ్గుపడి, తనదారిన తాను వెళ్లాడు.

# భారతప్రధాని నెహ్రూ

## శాంతి సౌహార్ద పర్యటన

ఇటీవల భారత ప్రధాని నెహ్రూ అయిదు వారాలపాటు రష్యా, పోలండ్, జెకోస్లోవాకియా, యుగోస్లావియా, ఆస్ట్రియా మొదలైన దేశాలు పర్యటించి, ఈ దేశాలకూ మన దేశానికీ మధ్య స్నేహసంబంధాలు బలపరచటమేగాక, ప్రపంచశాంతి సంరక్షణకు అనుకూలించే సంప్రతింపులుకూడా జరిపారు. ఈ "శాంతియోధుడు" వెళ్ళిన చోటనల్లా ఈయన దర్శనంకోసరం జనం లక్షోపలక్షలు గుమికూడారు. ఆయాదేశాల నాయకులు నెహ్రూకు అఖండ సన్మానాలు చేశారు. అనేకవేల ఏళ్ళపాటు చరిత్రలో చెప్పుకోదగిన ఈ నెహ్రూ పర్యటన గత జూన్ 5, జులై 12 మధ్య జరిగింది.

నెహ్రూ విమానంమీద జూన్ 5 న బొంబాయినుండి, తన కుమార్తె అయిన ఇందిరాగాంధితో, పరివారంతో బయలుదేరి, మధ్యదారిలో ఈజిప్టు రాజధాని అయిన కైరోలో కొద్దిసేపు నిలిచి, మర్నాడు జెకొస్లోవాకియా ప్రధాననగరమైన ప్రాగ్‌నగరం



జెక్‌ప్రధాని విలియం సిరోకీతో సంభాషిస్తున్న భారత ప్రధాని నెహ్రూ

చేరారు. అక్కడ జెక్ ప్రధాని మొదలైన వారాయనకు స్వాగతం ఇచ్చారు. ప్రాగ్‌లో ఒకరోజుండి, మర్నాడు రష్యా రాజధాని అయిన మాస్కో చేరారు.

నెహ్రూకు స్వాగతం చెప్పటానికి మాస్కోలోని విమానకేంద్రానికి రష్యా ప్రధాని మార్షల్ బుల్గానిన్ మొదలుగాగల 9 మంది అగ్రనాయకులూ, 40 మంది మంత్రులూ, 2 వేలమంది వివిధసంస్థల ప్రతినిధులూ వచ్చారు. భారతీయ, రష్యన్ జాతీయ గీతాలు వాయించబడ్డాయి. నెహ్రూ తన బసకు వెళ్ళుతుంటే రోడ్లకు ఇరువైపులా జనం గుంపులుగా నిలబడి హర్షధ్వానాలుచేశారు, నెహ్రూ మీద పూలు విసిరారు. రోడ్లకుపైగా నెహ్రూకు స్వాగతం చెబుతూ తోరణాలు కట్టబడ్డాయి.

నెహ్రూ రష్యా అంతటా రెండు వారాల పాటు పర్యటించారు. మొదటి మూడు రోజులు మాస్కోలోనే గడిపారు. అక్కడ ఆయన గౌరవార్థం అనేక విందులు జరిగాయి. ఆయన రష్యా అగ్రనాయకులతో సంప్రతింపులు జరిపారు. స్టాలిన్ మోటారు ఫాక్టరీ, విమానాల ఫాక్టరీ, లెనిన్, స్టాలిన్‌ల శరీరాలు భద్రపరచిన సమాధి, మాస్కో నగరపు భూగర్భరైల్వే, మాస్కో విశ్వవిద్యాలయం మొదలైనవి చూశారు. ఈ విశ్వవిద్యాలయం 32 అంతస్తుల భవనంలో ఉంది. 20 వేలమంది విద్యార్థులిందులో చదువుతున్నారు. డా. ఎం. ఎస్. క్రిష్ణన్ అనే భారతీయుడు రచించిన భూతత్వశాస్త్ర గ్రంథం రష్యన్‌భాషలోకి అనువదించబడి



రష్యాలోని ఉరాల్‌ప్రాంతంలో ఒక యంత్రనిర్మాణ కర్మాగారానికి నెహ్రూ వెళ్ళారు

ఈ విశ్వవిద్యాలయంలో పఠించబడుతున్నది. జూన్ 11 ఉదయం నెహ్రూ స్టాలిన్‌గ్రాడ్ చేరారు. గత యుద్ధంలో ఈ నగరం హిట్లరు మూకలధాటిని వీరోచితంగా ఎదుర్కొని నిల బడింది. కాని ఆ యుద్ధంలో చాలా దెబ్బ తిన్నది. నెహ్రూ ఇక్కడ ప్రసంగిస్తూ ఈ నగరంయొక్క పరాక్రమాన్ని కొనియా డారు. ఈ నగరంపక్కగా వోల్గనది ప్రవ హిస్తున్నది. నెహ్రూ పడవమీద ప్రయాణం చేసి జలవిద్యుత్కేంద్రం సందర్శించారు.

మర్నాడు నెహ్రూ నల్లసముద్ర తీరాన గల సింఫెరోపోల్‌కు చేరారు. యుక్రాయిన్ అధికారులాయనకు స్వాగతం ఇచ్చారు. ఇక్కడ ఆయనతో పిల్లలు స్నేహం చేసుకుని, తమ వినోదాలతో కాలక్షేపంచేశారు. తరవాత నెహ్రూ యాల్టాకు వెళ్లారు. అక్కడ యుద్ధ కాలంలో రూజువెల్ట్, చర్చిల్, స్టాలిన్ సమా వేశమైన చోటు సందర్శించారు.

యాల్టానుంచి నెహ్రూ జార్జియారాష్ట్రం వెళ్ళారు. ఈ రాష్ట్రం స్టాలిన్ జన్మస్థానం. రూస్తవీ అనేచోట నెహ్రూ ఒక ఉక్కు కర్మా గారంచూచారు. జార్జియానుంచి తుర్క్‌ మేనియామీదుగా నెహ్రూ తాష్కెంట్‌నగరం చేరారు. ఇక్కడ ఆయనకు ఉర్దూభాషలో స్వాగతం చెప్పబడింది.

తాష్కెంట్‌కు 200 మైళ్ళ దూరాన సమ ర్కండ్ ఉన్నది. ఇక్కడ తామర్లేన్ గోరీ మొదలైన చరిత్రప్రసిద్ధమైన శిథిలా లున్నాయి. జూన్ 15 న నెహ్రూ వీటిని చూడ వెళ్ళారు. తాష్కెంట్‌కు తిరిగి వచ్చి



తాష్కెంట్ నగర విమానాశ్రయంలో నెహ్రూకు స్వాగతం

అక్కడ ఒక బట్టలమిల్లూ, సమష్టి వ్యవసాయ క్షేత్రమూ చూశారు. రైతుల ఇళ్ళకు వెళ్ళి వారితో మాట్లాడి, వారితో భోజనంచేశారు.

తాష్కెంట్‌నుంచి నెహ్రూ కజక్‌స్తాన్ వెళ్లారు. రష్యాలోని రాష్ట్రాలన్నిటిలో ఇది పెద్దది. ఇక్కడ ముస్లిముల సంఖ్య హెచ్చు. ఇది ఒకప్పుడు వట్టి ఎడారి ప్రాంతం, ఊసర క్షేత్రం. ఇప్పుడిక్కడికికూడా సోవియట్ నాగరికత వ్యాపించింది.

ఇక్కడినుండి నెహ్రూ అల్తాయ్‌ప్రాంతం వెళ్లారు. ఈ ప్రాంతంలో కొత్తగా 60 వేల ఎకరాల బీడు గోధుమల సాగుకిందికి తెచ్చారు.

తరువాత నెహ్రూ లెనిన్‌గ్రాడ్ నగరానికి వచ్చి రెండురోజులు గడిపారు. ఈ సమయంలో ఆయన చిత్రకళాప్రదర్శనం "సుప్త సుందరి" నృత్యనాటికా, టర్బయిన్ ఫాక్టరీ చూశారు. జూన్ 21 న మాస్కోకు తిరిగి వచ్చారు. ఆరోజే డైనమో స్టేడియంలో బహిరంగసభలో నెహ్రూ ప్రసంగించారు. 80 వేల మంది సభకు వచ్చారు. నెహ్రూ అనంతరం బుల్గానిన్ మాట్లాడుతూ నెహ్రూనూ, ఇండియానూ అభినందించారు. నెహ్రూ ఈసారి మాస్కో వచ్చినప్పుడు అతి రహస్యమైన పరమాణుశక్తి కర్మాగారం చూశారు. నెహ్రూ స్వాగతంలాగే వీడ్కోలుకూడా చాలా ఘనంగా జరిగింది.

రష్యానుంచి నెహ్రూ పోలండ్ రాజధాని అయిన వార్సా చేరారు. పోలండ్ ప్రధాని మొదలైనవారు స్వాగతమిచ్చారు ఆ సాయంకాలం నెహ్రూ గౌరవార్థం విందుజరిగింది.



నెహ్రూకు వార్సా (పోలండ్) మేయర్ గౌరవపౌరసత్వం ఇచ్చారు

గతయుద్ధంలో పోలండ్ ముఖ్యనగరమైన వార్సా చాలా దెబ్బతిన్నది. ఈ యుద్ధ దుష్ఫలితాలను నెహ్రూ స్వయంగా చూశారు. నెహ్రూ ఇక్కడ మూడురోజులుండి కొన్ని నగరాలూ, ఫాక్టరీలూ చూసి 26 న ఆస్ట్రియా రాజధాని అయిన వియెన్నా చేరారు. ఆయనకు ఆస్ట్రియా చాన్సలర్, రాబ్ మొదలగువారు గొప్ప స్వాగతం ఇచ్చారు. ఆస్ట్రియా ఇటీవలనే మిత్రరాజ్యాల సైనికాక్రమణనుండి బయటపడి స్వతంత్రమయింది. ఇక్కడ కూడా ఆయనకు గొప్ప సన్మానాలూ, విందులూ జరిగాయి.

జూన్ 30 న నెహ్రూ యుగోస్లావియా రాజధాని, బెల్‌గ్రేడ్ చేరారు. అధ్యక్షుడు మార్షల్ టిటో మొదలైనవారు ఆయనకు ఘనస్వాగత మిచ్చారు. నెహ్రూ రైలుపై సరజెవోకు వెళ్ళారు. ఇక్కడే 1914 లో ఆర్చ్‌డ్యూక్ ఫెర్డినాండ్ హత్య జరిగింది, దాని ఫలితంగా మొదటి ప్రపంచయుద్ధం కూడా జరిగింది. సరజెవోనుంచి కారులో జెల్లూనికా అనే నగరానికి వచ్చేదారిలో టిటో, నెహ్రూ, ఇండియా యుగోస్లావియాల స్నేహ చిహ్నాలుగా రెండు చెట్లు నాటారు.

యుగోస్లావియాలో నెహ్రూ చాలా చోట్లు సందర్శించారు. జగ్రెబ్‌నగరంలో ఒక ఫాక్టరీ రాజస్తాన్ ప్రభుత్వంకోసం విద్యుద్యంత్ర సామగ్రి తయారుచేస్తూండటం నెహ్రూ చూశారు.

జులై 7 న నెహ్రూ, ఇటలీ రాజధాని అయిన రోమ్‌నగరం చేరారు. అరాత్రి



స్టాలినోగ్రోడ్ (పోలండ్)లో పిల్లలు తయారుచేసిన బొమ్మనుచూసి ఆనందిస్తున్న నెహ్రూ

నెహ్రూ గౌరవార్థం ఇటలీ ప్రధాని అంతోనియో సెగ్నీ మొదలైనవారు ప్రభుత్వపక్షాన విందు జరిపారు. అక్కడి చరిత్రప్రసిద్ధమైన శిథిలాలు సందర్శించారు. మర్నాడు ఉదయం పోప్‌తో 20 నిమిషాలు ప్రసంగించారు.

జులై 8 రాత్రి నెహ్రూ లండన్ చేరారు. బ్రిటిష్‌ప్రధాని సర్ అంటొనీ ఈడెన్‌తో మాట్లాడారు. ఈ సంభాషణలలో విజయలక్ష్మి పండిట్, వి. కె. కృష్ణమీనన్‌లు పాల్గొన్నారు. జులై 10 రాత్రి లండన్‌నుంచి బయలుదేరి నెహ్రూ జులై 12కు బొంబాయికి తిరిగి వచ్చారు.

నెహ్రూ తిరిగిన అనేక దేశాలలో ఆయన అక్కడి రాజకీయ ప్రముఖులతోబాటు సంయుక్తప్రకటనలపై సంతకాలు చేశారు. ఈ ప్రకటనలు ప్రపంచశాంతికి చాలా అవసరమైనవి.

నెహ్రూ చేసిన ఈ శాంతియాత్ర చాలా చరిత్ర ప్రసిద్ధం కానున్నది. ఏమంటే, ప్రపంచంలోని ఉద్రిక్తతను తగ్గించటానికి జినీవాలో అగ్రచతుష్టయం సమావేశం కాబోతున్న తరుణంలో నెహ్రూ ఈ యాత్ర జరిపారు. అనేకచోట్ల ఈ అగ్రచతుష్టయ సమావేశం విజయవంతం కావాలన్న అభిప్రాయంకూడా వెల్లడించారు. ఈ యాత్రలో నెహ్రూచేసిన కృషికి బహుమతిగా భారతాధ్యక్షుడు నెహ్రూకు "భారతరత్న" బిరుదు ప్రసాదించారు. ★



యుగొస్లావియా అధ్యక్షుడు మార్షల్ టిటో, నెహ్రూ, టిటో సతీమణి

# నిత్యశంకితుడు



రచన : వజ్రపాణి

అనుమాన పిశాచముతో
అనుక్షణమూ బాధపడే
అన్నమయ్య తాతకు ని
ద్రాహారము లుండవు!

ముసలి అన్నమయ్యచెంత
మసలు వేయి రూపాయలు!
పెట్టెయందు పెట్ట డతడు!
గట్టిగ బొడ్డుననె దాచు!

కొడుకు పేరు రామదాసు!
కూతురు నాంచారమ్మ!
ఆమె ధనాశాపరురా,
లత్తవారి యింట నుండు.

తన బొడ్డున గల మూటను
తనయు డపహరించు విధము
కనిపించెను కలలో!! వృ
ద్ధున కనుమానము హెచ్చెను!

ఇది యొక అపశకునముగా
మది నెంచిన అన్నమయ్య
తన కుమార్తె అత్తవారి
జనపదమున కేగినాడు!

తన తండ్రికి 'నాంచారమ'
ఘన స్వాగత మిచ్చెను!

గారెలతో, బూరెలతో,
ఆరగింప బెట్టెను!

కొడుకుకంటె తన కుమార్తె
కడు నుత్తము రాలనుచును-
అన్నమయ్య నాటిరాత్రి
హాయిగ నిద్రించెను!

అర్థరాత్రియైన పిదప
అతనికి మెలకువ వచ్చెను!
తన బొడ్డున గల మూటను
తనయ విప్పుటను చూచెను!

"నీవు సుగుణవని తలచితి!
నీకంటెను కొడుకె నయము!
అతని కడకె పోదు" ననుచు
అపుడే పయనము కట్టెను!

అడవి మధ్య కాలిబాట!
అర్థరాత్రి ప్రయాణమా?
గజ దొంగలు పసి గట్టిరి
"గబగబ" నడచెడు వృద్ధుని!

కన్నుమూసి తెరచులోన
అన్నమయ్య కిందపడెను!
నిత్యశంకితుని సొత్తటు
నిశాచరుల పాలయ్యెను!



# వార్తలు-విశేషాలు

జాతీయాభివృద్ధికిగాను, ప్రజలనుండి 100 కోట్ల రూపాయలు ఋణంగా ప్రభుత్వం సేకరించింది. ఈ మొత్తం ద్వితీయ పంచవర్ష ప్రణాళికావసరాలకు వినియోగించబడుతుంది. ప్రభుత్వం కోరిన యీ 100 కోట్ల రూపాయిలూ జూలై 4వ తేదీకే వసూలయినవి.

* * * *

ఈ సంవత్సరం గాంధీస్మారక నిధినుంచి కుష్ఠురోగ నివారణకు ఒకకోటి రూపాయిలూ, భూదాన యజ్ఞానికి 12 లక్షల రూపాయిలూ మంజూరుచేయబడింది. ఈ నిధికి అధ్యక్షులు శ్రీ జి. వి. మౌలంకర్‌గారు.

* * * *

భారత అధ్యక్షుడు శ్రీ బాబు రాజేంద్రప్రసాద్ తమ దక్షిణదేశ పర్యటనలో హంపీక్షేత్రాన్ని దర్శించారు. వారు అక్కడ గల శిథిలకళాసంపదను చూచారు. విరూపాక్ష దేవాలయంలో పూజచేశారు.

* * * *

మనదేశంలో అజంతా, ఎల్లోరాగుహలు గొప్ప శిల్పకళాసంపదలుగలవి. వీటిని దర్శించకోరే యాత్రికుల సౌకర్యంకోసం ఆ ప్రాంతాన దుమ్ము లేని రోడ్లనిర్మాణానికి భారత ప్రభుత్వం 18 లక్షల రూపాయలు మంజూరు చేసింది. ఔరంగాబాదునుంచి అజంతా, ఎల్లోరాలకు రోడ్డు నిర్మాణంతోపాటు, అక్కడ అధునిక సౌకర్యాలు కల రెండు హొటల్స్ కూడా నెలకొల్పబడగలవు.



పారిశ్రామికంగా మనదేశం చాలా త్వరితంగా అభివృద్ధి అవుతోంది. **1953 - 54** లో యూరప్ దేశాల్లో జరిగిన పరిశ్రమల అభివృద్ధి ప్రమాణంలోనే మనదేశంలో కూడా అభివృద్ధి జరిగింది. ఈ విషయం మిత్రరాజ్యసమితి ప్రకటించిన ప్రపంచ ఆర్థిక నివేదికద్వారా తెలుస్తున్నది.

* * * *

ఆంధ్రరాష్ట్రంలో కొత్తగా మూడు చక్కెర ఫ్యాక్టరీలు స్థాపించేందుకు భారత ప్రభుత్వం లైసెన్సులు యిచ్చింది. వీటిలో రెండు కృష్ణాజిల్లాలోను, మూడవది గుంటూరు జిల్లా రేపల్లెలోనూ స్థాపించబడగలవు.

* * * *

ఈ సంవత్సరమునుంచి, బాలబాలికల క్షయవ్యాధి చికిత్సకుగాను మరిరెండు కేంద్ర చికిత్సాలయాలను భారత ప్రభుత్వం స్థాపించనున్నది. వీటిలో ఒకటి ఉత్తరభారతదేశంలోను, రెండవది దక్షిణ భారతదేశంలోను స్థాపిస్తారు.

* * * *

అంగారక గ్రహంపై చెట్టుచేమలున్నవని సోవియట్ వైజ్ఞానికులు చెపుతున్నారు. ఆ చెట్లు దాదాపు భూమిపై ఉన్నవాటిని పోలివున్నవట.

* * * *

కేంద్రమంత్రి డాక్టర్ బి. వి. కేస్కర్, విజయవాడ రేడియో కేంద్రాన్ని అభివృద్ధి చెయ్యడానికి ఇండియా ప్రభుత్వం నిశ్చయించిందని తెలియజేశారు. ఈ ఆర్థిక సంవత్సరంలోనే **20** కిలోవాట్ల మీడియంవేవ్ ట్రాన్సిమిటర్ ఏర్పాటు చెయ్యబడగలదు.

* * * *

సేవాగ్రామంలోని చారిత్రక ప్రాముఖ్యత గల గాంధీజీ కుటీరం, తదితర కుటీరాలను జాగ్రత్తగా కాపాడేందుకు ఒక పథకం తయారవుతోంది. ఈలోపల, గాంధీజీ నివసించిన కుటీరాన్ని యాత్రికులు సందర్శించేందుకు వీలుగా తెరచివుంచటానికి ఏర్పాట్లు జరిగినవి.



# గోడమీది బొమ్మ - 2 (అట్టచివరి బొమ్మ)

చ్వాంగ్ పొలం వెళ్ళాడేకాని, వాని మనస్సంతా ఇంటో గోడమీది బొమ్మపైనే వుంది. అందుచేత, పొలంపని చకచక ముగించేసుకొని, సాయంత్రం పెందరాళే ఇంటిముఖం పట్టాడు. ఇవాళ అడుగులు గబగబ పడసాగినై.

పొలిమేరకు వచ్చాడు. ఇల్లు చేరుకుని, అట్టె పైకి చూచాడు, వంట యింటి పొగగొట్టంలోంచి పొగ వస్తూన్నది! ఈ వింతకు చ్వాంగు విస్తుపోయాడు. తలుపు తెరిచి లోపల ప్రవేశించేసరికి, పొయ్యిమీద దివ్యమైన పదార్థాలు పక్వమవుతున్నయి! ఎన్నడైనా ఇటువంటిది చ్వాంగు చూచివుంటేకద!—ఆబకొద్దీ అవన్నీ—ఒక్కటీ మిగలకుండా ఆరగించేశాడు. చ్వాంగ్ అంత్రమంతా గోడమీది సుందరి బొమ్మ చూచి, నవ్వుతూనేవుంది.

మర్నాడు చ్వాంగు, పొలానికి పోయేముందు తన చింకికోటు తీసి ఇవతల పెట్టి, 'నిన్న నెవరో అన్నపూర్ణాదేవి నాకు చక్కటి భోజనం తయారుచేసి పెట్టింది. తలిస్తే, ఆమెకు ఈ పేదవాని కోటు బాగుచేసిపెట్టడం ఏపాటి పని!' అనుకున్నాడు.

ఉండబట్టలేక ఇవాళ చ్వాంగు పొలంనుండి ముందుగానే వచ్చేశాడు. కిటికీలోంచి తొంగిచూశాడు. ఒకానొక సుందరి దీక్షతో కూర్చుని, వాని చింకి కోటు కుట్టుతున్నది! గోడవైపు చూశాడు. పటంలోని సుందరి కనబడలేదు!

గభీమని వెళ్ళి చ్వాంగ్ ఆమె చెయ్యి పట్టుకొన్నాడు. 'సుందరీ!—నువు మళ్ళీ పటంలోకి పోవద్దు. నాతో ఉండిపో' అని బతిమాలాడు. 'సరే' నన్నది సుందరి. కాని, చ్వాంగ్‌కు నమ్మకం చాలక, గోడమీది కాళీపటాన్ని చుట్టేసి, పెట్టెలో పెట్టేసి, తాళం వేసుకొన్నాడు. 'ఇక సుందరి ఏంచేస్తుంది? ఇవతలే ఉండిపోక తప్పదుకద!'—అని అతని ఉద్దేశం.

అటుతరవాత—వాళ్ళిద్దరూ మోకరిల్లి, భార్యా భర్తలుగా ప్రమాణ స్వీకారం చేశారు.

చ్వాంగు సతి చాలా తెలివైనది. వివేకవతి. భర్తకు అనుకూలవతి. చ్వాంగ్ ఇంటికి వెలుగుగా ప్రకాశించే ఆ సుందరిని అందరూ 'జ్యోతి' అని పిలుస్తూవచ్చారు. వాళ్ళిద్దరూ చిలకాగోరింకల్లాగా కాపరం చేస్తూవుండగా ఒక చిత్రం జరిగింది...

# గ్రహాలు : భూమి



లోగడ బుధగ్రహంగురించీ, శుక్రగ్రహం గురించీ తెలుసుకున్నాం. ఆ రెంటి తరువాత సూర్యుడికి దగ్గిరిగా ఉన్నది మనం ఉండే భూమి. మనం దీనిమీదనే ఉంటున్నాం గనక, ఇతర గ్రహాలకంటె మనకు దీనినిగురించి ఎక్కువ తెలుసు.

* భూమికీ సూర్యుడికీ మధ్యఉండే దూరం **9,14,06,000** మైళ్లనుంచి **9,45,24,000** మైళ్ళదాకా ఉంటూఉంటుంది. సూర్యుడినుంచి బయలుదేరిన కాంతి భూమిని చేరటానికి సుమారు **8** నిమిషాలు పడుతుంది.

* భూమియొక్క అడ్డుకొలత నిలువుగా **7899**న్నర మైళ్ళు. అడ్డంగా **7926**న్నర మైళ్ళు. భూమి చుట్టుకొలత—భూమధ్యరేఖ నిడివి—**24,899** మైళ్ళు.

* భూమియొక్క వైశాల్యం **19** కోట్ల, **69** లక్షల, **50** వేల చదరపుమైళ్ళు; ఇందులో సముద్రం **13** కోట్ల, **94** లక్షల, **40** వేల చదరపు మైళ్ళు ఆక్రమించి ఉన్నది; మిగిలిన **5** కోట్ల, **75** లక్షల, **10** వేల చదరపుమైళ్ళు నేల.

* భూమియొక్క పరిమాణం **26** వేల కోట్ల ఘనమైళ్ళు. భూమియొక్క బరువు **6** కోట్ల కోట్ల-కోట్ల టన్నులు.

* భూమి సూర్యుడి చుట్టూ తిరిగే దారి నిడివి **58** కోట్ల మైళ్ళు. ఈ దారివెంట భూమి ఒక సెకండుకు **18**.మైళ్ళ వేగాన (గంటకు **66** వేల మైళ్ళ చొప్పున) నడుస్తున్నది. ఒక్కసారి భూమి సూర్యుణ్ణి చుట్టిరావటానికి **365** రోజుల **6** గంటల **9** నిమిషాలు పడుతుంది.

* భూమిచుట్టూ నూరు, రెండువందలమైళ్ళ మందాన గాలిపొర ఉన్నది. ఇది భూమితో పాటు తిరుగుతూ ఉంటుంది. ఈ విధంగా భూమిని చుట్టిఉన్న గాలిపొర బరువు **1** లక్ష **16** వేల కోట్ల, కోట్ల పౌనులుంటుందని అంచనా వేశారు.

* భూమియొక్క ఉపగ్రహం చంద్రుడు. భూమి అగ్నిగోళంగా ఉండి తిరుగుతున్నప్పుడు ఒక పెళ్ళ విడిపోయి, చంద్రుడయిందని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. ఒకప్పుడు చంద్రుడు భూమికి చాలా దగ్గిరగా ఉండేదట. ఇప్పుడు దూరంగా వెళ్ళింది. ఇప్పటికైనా చంద్రుడు భూమికి అటే దూరం లేదు; భూమి చుట్టుకొలతకు పదింతల దూరంలో ఉంది.

* భూమిమీద ఉన్నంతగా ఏ ఇతర గ్రహంమీదా ప్రాణికోటి వుండే అవకాశం లేదు. బుధ శుక్రగ్రహాలలో వేడిజాస్తి. భూమికన్న దూరం పోయినకొద్దీ సూర్యకాంతి తగ్గిపోతుంది. కొన్ని గ్రహాలలోని వాతావరణం ప్రాణులకు అనుకూలమైనదికాదు.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1955 అక్టోబర్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ ఆగస్టు 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: విన్నారా మీరంత! | రెండవ ఫోటో: కన్నారా ఈ వింత!

పంపినవారు: డి. ఆనందమూర్తి, 24-ఎ, ఎల్లిగను వీధి

ఎ - నగరు, మదరాసు - 12.

బహుమతిమొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది

# చిత్రకథ



ఒక సెలవురోజున లైబ్రరీనించి దాసు ఒక పుస్తకం తెచ్చాడు. అందులో ఒక వేటగాడిని గురించిన కథ వుంది. వాడు జంతువులను వేటాడేందుకు అడవికి పోతాడు. ఆ కథ దాసు చదువుకుపోతూంటే వాసు చెవులు ఒప్పచెప్పి వింటున్నాడు. "వేటగాడికి హఠాత్తుగా ఒక పొదచాటున పులి కనబడింది! అది బాణం ఎక్కుపెట్టి కొట్టేందుకూడా వీలులేనంత దగ్గర్లో వుంది. పులి ఒక్కొక్క అడుగే వేస్తూ ముందుకు వస్తోంది. వేటగాడు ఒక్కొక్క అడుగే వెనక్కు వేస్తున్నాడు..." చదువుతున్న కథలో మునిగిపోయిన దాసు కుర్చీలో ఒక్కొక్క అంగుళమే ముందుకూ వెనక్కూ కదిలి, వెల్లికిలా 'టైగర్' మీద పడిపోయాడు.



Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI 'CHAKRAPANI'

Photo by B. Bhansali



బహుమతి
పొందిన వ్యాఖ్య

కన్నారా ఈ వింత!

పంపినవారు :
డి. ఎ. మూర్తి - మద్రాసు

